



ప్యారీస్ మిఠాయిలు మరియు బిస్కట్లు అందరికీ ఇష్టం

# PARRY'S PAGE

క్రిందటిసారి మేము [నా సహాయకులు క్యారమిల్క్, కాఫీ బైట్, త్రిమ్మీ మరియు నేను] మిమ్మల్ని జంతు ప్రపంచంలోకి తీసుకు వెళ్ళాము. ఈ సారి మనం సరదాగా స్వారీ చేద్దాం రండి! అద్భుతమైన రవాణా సాధనాలు వున్న ప్రపంచంలోకి ప్రవేశిద్దాం. మరచిపోవద్దు. అతి త్వరలోనే చిన్న విజ్ఞాన సర్వస్వాన్ని మీరు స్వంతం చేసుకుంటారు!

## సరదాగా స్వారీచేద్దాం రండి!





స్కాట్ లెండ్‌కి చెందిన కమ్మరి, 1839 లో పెడల్ బైసికిల్‌ని కనిపెట్టాడు. ఈ రోజున మానవ శక్తితో నడిపే వేగవంతమైన ప్రయాణ సాధనం సైకిల్. ఇక సైకిల్ రేస్‌లలో పాల్గొనే వారు సైకిల్‌ని గంటకి 78 కి.మీ వేగంతోనూ తొక్కగలరు

ప్రారంభంలో కొత్త ప్రదేశాలను కనిపెట్టాలనుకున్న వారు ఇటువంటి కర్ర దుంగల మీద సముద్రంలో ప్రయాణం చేశారు. ఈ రోజున ప్రపంచంలో పెద్ద దయిన ప్రయాణీకుల నౌక క్వీన్ ఎలిజిబెత్ 2 లో 2,000 మంది ప్రయాణం చేయవచ్చును. ఇందులో రెస్టారెంట్‌లు, ఆధునిక వసతులు వున్న క్యాబిన్లు, వంట_గదులు వున్నాయి. ఈత కొలను కూడా!



మీకు తెలుసా?
ఇంగ్లండులో కారుకి నంబర్ ప్లేట్ లేని ఒకే ఒక వ్యక్తి బ్రిటిష్ మహారాణి.
రిక్షాని తూర్పు దేశాలలో కాదు పశ్చిమ దేశాలలో కనిపెట్టారు.
జోనధాన్ స్కోబి అనే అమెరికా దేశస్థుడు. 1869 లో రిక్షా తయారుచేసి రోగగ్రస్తురాలైన తన భార్యని అందులో తీసుకు వెళ్ళి జపాన్‌లో వింతలు, విశేషాలు చూపించాడు.!
మీ తలలోని వెంట్రుకలతో పూర్తి నిడివిగల త్రాడు తయారు చేస్తే అది ఎంత గట్టిగా వుంటుందో తెలుసా. దానితో ఒక కారుని ఎత్తగలము.

దారికనిపెట్టండి ఈ చిన్న కారులోకి ఎక్కి చిక్కు త్రోవ లోంచి బయటకు రండి.









హోవర్ క్రాఫ్ట్ అంటే ఏమిటి? ఇది ఎగిరే ఓడ లాంటిది. ఇది నీటిపైన కొంచెం ఎత్తులో గాలి పరుపు మీద సాగుతూ వుంటుంది. మామూలు ఓడ కన్నా ఎంతో వేగంగా వెళ్తుంది.

రైట్ సోదరులు మొట్టమొదటి విమానం నిర్మించి గాలిలో ప్రయాణం చేసి నూరు సంవత్సరాలు కావస్తోంది. ఈ నాటి జంబో జెట్ [ఇది ప్రపంచంలో మిక్కిలి పెద్దదయిన పాసింజర్ ఎయిర్ క్రాఫ్ట్ బోయింగ్ 747 ] రెక్కలు, రైట్ సోదరులు మొదట ఎగిరిన దూరం కన్నా పెద్దవి! ఇక ప్రయాణ సాధనాల చరిత్రలో అత్యద్భుత మైన విజయ సాధనాలలో ఒకటిగా కాంకార్డ్‌ని చెప్పుకోవాలి. ఈ సూపర్ సానిక్ పాసింజర్ ఎయిర్ క్రాఫ్ట్ ఊహించ లేని వేగంతో — గంటకి 2,170 కి.మీ —ఎగురుతుంది.



ఆవిరితో పనిచేసే ప్రయాణ సాధనాలు కనిపెట్టడానికి ముందు ప్రజలు కాలినడకమీద, గుర్రాలు లాగే బండ్ల మీద వెళ్ళేవారు. కొంతమంది సాహసవంతులు సముద్రం మీదా ప్రయాణం చేసేవారు. అయితే అవన్నీ కష్టంతో కూడుకున్న పనులే కాక అలసట పుట్టించేవీనూ.



ఆ తర్వాతే 1769 లో జేమ్స్ వాట్ స్టీమ్ ఇంజన్ కనిపెట్టాడు. కొన్ని సంవత్సరాల తర్వాత జార్జి స్టీఫన్‌సన్ అనే బ్రిటిష్ దేశస్థుడు ఒక లోకోమోటివ్‌ని నిర్మించాడు. ఇది గంటకి 16 కి.మీ వేగంతో ప్రయాణం చేసేది. అతి త్వరలోనే ప్రపంచమంతటా రైల్వేలు వచ్చాయి. తక్కువ ఖర్చుతోనూ, ఎక్కువ సుఖంగానూ ప్రయాణం చేయడానికి ట్రెయిన్‌లు వీలు కలిగించాయి. ఈ రోజున ఫ్రాన్స్‌లో శరవేగంతో ప్రయాణం చేసే టిజివి ట్రెయిన్ వుంది. దాని వేగం గంటకి 380 కి.మీ.





మొట్టమొదటి కారు?! ఔను. అచ్చు యిలాగే వుంటుంది. ఇది గంటకి సుమారు 5 కి.మీ వేగంతో ఆవిరితో నడిచింది. అయితే అసలైన కార్లని 1885 లో డైమ్లర్ మరియు 1886 లో బెంజ్ తయారుచేశారు. ఇవి పెట్రోల్‌తో నడిచాయి.




THE KING OF SWEETS



# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

## ఎన్నికలు—ప్రజాస్వామ్యం

మనదేశంలో మరొక లోక్‌సభ ఎన్నికల కోలాహలం ముగిసింది. పద్దెనిమిదేళ్ళు నిండిన యువతీ యువకులు ప్రప్రథమంగా ఓటు హక్కును వినియోగించుకోవడం ఈ ఎన్నికల విశేషం!

మనది ప్రపంచంలోకెల్లా అతిపెద్ద ప్రజాస్వామ్య దేశం. అంతేకాదు; తూర్పుదేశాలలో ఇక్కడ మాత్రమే ప్రజాస్వామ్యం నిరంతరాయంగా కొనసాగుతున్నది. ఎక్కడో ఎందుకు ? మన దేశం నుంచి విడిపోయి, మనతోపాటే స్వాతంత్ర్యం పొందిన పాకిస్థాన్‌ను తీసుకున్నా—అది చాలాకాలం సైనికనియంతృత్వపాలన కిందే గడపవలసి వచ్చింది!

ప్రజాస్వామ్యంలో లోపాలు లేకపోలేదు. అయితే, ఇతర వ్యవస్థలకన్నా ఇందులో స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఎక్కువ. అందుకే ధానికి భిన్నమైన రాజకీయ సిద్ధాంతాలను అనుసరించిన కొన్ని దేశాలు సైతం, ఇటీవల ప్రజాస్వామ్యం కేసి పయనిస్తున్నవి.

నిజాయితీతో, నిరంతర జాగరూకతతో, ఎదుటివారి మంచిని కూడా దృష్టిలో వుంచుకుని బాధ్యతాయుతమైన పౌరులుగా నడుచుకుంటే—ప్రజాస్వామ్యం ద్వారా, జీవితాన్ని సుసంపన్నం చేసే మరిన్ని సత్ఫలితాలను సాధించవచ్చు. మనల్ని మరింత బాధ్యతాయుతమైన ఆదర్శపౌరులుగా తీర్చిదిద్దుకుందాం!

సంపుటి 85 డిసెంబర్ '89 సంచిక 6
విడి ప్రతి: 3-00 : : సంవత్సర చందా: 36-00






SANKAR

# SUNDROPS KIDS



## *Sundrops Kids are coy 'n' bookish prim 'n' prudish!*

Sundrops Kids. You can spot them a mile away ! Their laughing faces. Their busy, buoyant feet. Their rough 'n' tumble games.

And you can spot their Sundrops Shoes. As colourful, exciting and trendy as this peppy, happy clan. Made of bright, vibrant, easy-to-clean canvas. With a flexible rubber sole to match.

Sundrops Shoes. Not just any kid can walk away in them!

*Special Festival Offer for 1989*




COLOURFUL CANVAS SHOES FROM Bata

*For mischievous young people only!*

LINTAS (CAL)/BA/SD/1/2116



# దలైలామాకు శాంతిబహుమతి

టిబెట్‌లోని కొండలమధ్య ఒక మారుమూల గ్రామంలో జన్మించాడాయన. అయినా, అక్కడి ప్రజల ఆధ్యాత్మిక రాజకీయ నాయకుడయ్యాడు. ఆయనే టెన్‌జిన్ గియాట్సో అని పేరుగాంచిన పదునాలగవ దలైలామా!

టిబెట్ చాలా విచిత్రమైన దేశం. హిమాలయ పర్వతాలకు ఉత్తర దిశలో 470,00 మైళ్ళు విస్తరించిన ఈ దేశ జనాభా పదిహేను లక్షలు. అందరూ బౌద్ధమతస్థులే.

ఒక దలైలామా మరణించినప్పుడు, ఆయన ఆత్మ, అప్పుడే పుట్టిన వేరొక శిశువులో ప్రవేశిస్తుందని అక్కడి వాళ్ళు విశ్వసిస్తారు. దలైలామా ఆత్మ ఏ శిశువులో ప్రవేశించిందో కనుగొనడానికి, ఆ శుభ లక్షణాలు ఎరిగిన దామాలు వందలాది గ్రామాలను నెలల పర్యంతం, అవసరమయితే సంవత్సరాల తరబడి పర్యటిస్తారు. ఈనాటి దలైలామాను కూడా ఈ పద్ధతిలోనే కనుగొన్నారు. పసిబిడ్డగా వున్నప్పుడే ఆయన అపూర్వ పరిపక్వతను కనబరిచాడు; అంతకు ముందెన్నడూ చూడని వారిని పేరు పేరునా పిలిచి పలకరించాడు!

ఆయన జీవితంలోని ఈ ఘట్టానికీ, ఇప్పుడాయనకు శాంతి బహుమతి లభించడానికీ ఎలాంటి సంబంధమూ లేదు.

ఇటీవలి కాలంలో టిబెట్ అనేక క్లిష్ట పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది. పద్దెనిమిదవ శతాబ్దంలో చైనా మంచూ రాజులు, టిబెట్‌ను ఆక్రమించారు. అయితే, మంచూ వంశం అంతరించాక, టిబెట్ ప్రజలు చైనా సైనికులను తరుమగొట్టి స్వతంత్రం ప్రకటించుకున్నారు. అయినా, 1950 వ సం॥ ఉత్తర టిబెట్‌ను చైనా ఆక్రమించింది. 1959 వ సంవత్సరం చైనా అధికారంపై టిబెట్ ప్రజలు తిరుగుబాటు జరిపారు. కాని, చైనా తిరుగుబాటుదార్లను దారుణంగా అణచివేసింది. టిబెట్ రాజధాని లాసాలోని దలైలామా భవనాన్ని చాలావరకు నేలమట్టం చేసింది. దలైలామా అతి కష్టం మీద భారతదేశం చేరుకున్నాడు. ఆ తరవాత వేలాది మంది టిబెటన్లు ఇండియాకు వలస వచ్చారు. నాటినుంచి వాళ్ళందరూ దలైలామా నాయకత్వంలో ఎంతో క్రమశిక్షణతోనూ, గౌరవంతోనూ కాలం గడుపుతున్నారు. దలైలామా తన దేశ ప్రజల బాధలను ఎంతో ఓర్పుతో ప్రపంచానికి చాటాడు. ఈ విషయంలో ఆయన ఎంతో సంయమనాన్ని పాటించాడు. తన ప్రజల దైన్య స్థితికి ఆయన ఎంతగానో ఆవేదన చెందాడు గాని

ఎప్పుడూ ఆగ్రహం చెందలేదు. నిజమైన బౌద్ధ మతావలంబిగా, ఆయన తన ఆశయాలను శాంతి యుత మార్గంలోనే సాధించాలని దృఢనిశ్చయంతో కృషి చేస్తున్నాడు. ఆయన నొక శాంతిదూతగా ప్రపంచం గుర్తించింది. అందుకే ఆయనకు నోబెల్ బహుమతి లభించింది!

1985 వ సం॥ మార్చ్‌లో దలైలామా "ది హెరిటేజ్" పత్రికతో జరిపిన ప్రత్యేక గోష్ఠిలో ఇలా అన్నాడు: "మతం అంటే కేవలం విషయ ప్రయోజనమూ లేదు. దానిని తినాలి; జీర్ణించుకోవాలి; కొత్త శక్తిని పుట్టించాలి. అదేవిధంగా మతంలోని మంచిని అర్థంచేసుకోకుండా, దానిని మన జీవితాలలో ఉపయోగించుకోకుండా ఎలాంటి ప్రయోజనమూ సమకూరదు. తమ మతంలోని సత్యాన్ని చవిచూసిన ప్రతి ఒక్కరూ, ఇతర మతాలలోని ఔన్నత్యాన్ని తప్పక గుర్తిస్తారు. ప్రపంచంలో విభిన్న మనస్తత్వాలతో, రకరకాల ప్రజలు నివసిస్తున్నారు. వాళ్ళందరికీ ఒకే మతం



పరిజ్ఞానం మాత్రమే కాదు. అది అనుభవంలోకి రావాలి. ఆహారం ఆకలిని తీర్చినట్టే మతం మన అంతరంగ దాహాన్ని తీర్చాలి. పాత్రలలో మూసి భద్రపరచినంతమాత్రాన ఆహారంవల్ల ఎటువంటి తృప్తి కలిగించదు. అందుకే విభిన్నమతాలూ, విశ్వాసాలూ, తాత్విక ఆలోచనలూ ఏర్పడ్డాయి. వాటిపట్ల గౌరవాదరాలను అలవరచుకోవడం చాలా అవసరం."



# ఎంత శ్రమకు అంతే ఫలితం!

గోవర్ధనపురం జమీందారు భూపతికి, ఉన్నట్టుండి పెద్ద జబ్బు చేసింది. ఘన వైద్యులు రాత్రింబవళ్ళు శ్రమపడి ఆయన్ని తిరిగి మామూలు మనిషిని చేశారు. అయితే గాలి మార్పుకోసం ఆయన వేరేచోటుకు వెళితే తప్ప, పూర్తిగా మామూలు మనిషి కాలేడని వైద్యులు అభిప్రాయపడ్డారు. అందుకు తగ్గ గ్రామం శ్రీపురమని కూడా వాళ్ళు నిర్ణయించారు.

శ్రీపురం, గోవర్ధనపురానికి చాలా దూరం. ఆ ఊళ్ళో శ్రీపతికి దూరపు బంధువైన పేదరాలు తన కూతురుతో వుంటున్నది. భూపతి నెల రోజులపాటు అన్ని సుఖాలూ మరిచి సామాన్యుడిలా వుండడం అవసరం అన్నారు వైద్యులు. అంటే ఆయన రోజూ కాలినడకన కొంత దూరం వెళ్ళి రావాలి. విందుభోజనం లాంటి తిండి తినకూడదు. కటిక నేల మీద పడుకోవాలి. చుట్టూ పరివారంగానీ, భార్యాబిడ్డలు గానీ వుంటే, అది చూసి సహించలేరు! అందుచేత వైద్యులాయనను ఒంటరిగా శ్రీపురంలో వుండమని చెప్పారు.

శ్రీపురం సరయిన వానలు లేక కొంత కాలంగా క్షామానికి గురయింది. అక్కడ కూరగాయలు సరిగా పండడం లేదు. పంటలు సరిగా లేవు.

భూపతికి రుచులుకావాలి. శ్రీపురంలో సరయిన తిండి దొరకదని, భయపడి, ఆయన తన వెంట చిన్న జాడీలలో పది రకాల నిలవ పచ్చళ్ళు తీసుకు వెళ్ళాడు.

పేదరాలికి, భూపతి ఎందుకు వచ్చాడో తెలియదు. ఎన్నాళ్ళుంటాడో తెలియదు. కానీ ఆయన గొప్ప జమీందారని ఎరిగుండడంవల్ల మొదటి రోజున ఎక్కడి నుంచో కొద్దిపాటి కూరగాయలు సంపాదించి

"వసుంధర"



ఉన్నంతలో బాగా వండిపెట్టింది. అనారోగ్యంవల్లనో మరెందువల్లనో భూపతికి ఆ వంటలు చాలా రుచిగా వున్నాయి.

ఆయన పేదరాలిని మెచ్చుకుని, తన జబ్బు సంగతి చెప్పుకుని, ''ఇక్కడ నెల రోజులపాటు వుండడం ఎలాగా అని భయపడ్డాను. నీ వంట అద్భుతంగా వున్నది,'' అన్నాడు.

ఇది విన్న పేదరాలి గుండెల్లో రాయి పడింది. జమీందారుకు నెల రోజులు వండిపెడితే, ఆ ఋణం ఆయన వుంచుకోడని ఆమెకు తెలుసు. కానీ నెల రోజులపాటు జమీందారీ స్థాయిలో వంటలు చేయాలంటే, డబ్బు జమీందారుగారే యిచ్చినప్పటికీ శరీరశ్రమ ఎవరుపడతారు? అందువల్ల ఆమె పనిపాటుల్లో కూతురి సాయమడిగింది.

అప్పుడు కూతురు ఉమ, తల్లితో, ''అమ్మా మనం అంత కష్టపడి వంటలు చెయ్యలేం. ఒకటి, రెండు రోజులైతే ఫర్వాలేదు. నెల రోజులంటే చాలా కష్టం. ఏదో మనకు చేసినట్టే వంట చెయ్యి. ఆయన వెంట తెచ్చుకున్న పచ్చళ్ళే వేసి భోజనం పెట్టేద్దాం,'' అన్నది.

ఇందుకు పేదరాలు సరేనన్నది. మర్నాడు ఆమె జమీందారుకు మామూలుగా వంటచేసి, ''బాబూ, తమరు జబ్బు మనిషన్న మాట మరిచి రకరకాల వంటకాలు చేశాను. ఈ రోజు నుంచీ మీరు తెచ్చుకున్న పచ్చళ్ళే వడ్డిస్తాను. అవే మీ వంటికి మేలు చేసేవి,'' అన్నది.

భూపతి అందుకు అభ్యంతరం చెబుతూ, ''నా వంటికి ఒక్క గాలి మార్పే కాదు, తిండి మార్పు కూడా అవసరం. లోగడ ఎప్పుడూ తినే ఆ పచ్చళ్ళు పనికి రావు,'' అన్నాడు.

అయినా పేదరాలు ఆయన మాటలు వినిపించుకోలేదు.

రోజూ భూపతి ఊళ్ళో తిరగడానికి, ఉమ తోడుగా వెళ్ళేది. వాళ్ళిద్దరూ ఎన్నో విషయాలు మాట్లాడుకునేవాళ్లు. భూపతి,

ఉమ చలాకీతనం చూసి ముచ్చటపడి, "నీకు మంచి సంబంధం చూసి పెళ్ళి చేస్తాను. ఖర్చంతా నేనే భరిస్తాను," అంటూండేవాడు.

ఉమ ఈ విషయం తల్లికి చెప్పింది. తల్లి ఎంతో సంతోషించి, "భూపతి బాబు చాలా మంచివాడు. ఆయన మన ఊరు రావడం, మన అదృష్టం," అన్నది.

ఇలా రెండువారాలు గడిచాక భూపతి, ఉమతో, "ఉమా, నేను తెచ్చిన పచ్చళ్లు రోజూ మా ఇంట్లో తినేవే! అవే యిక్కడా తినడం యిబ్బందనిపిస్తున్నది. తిండంటే విరక్తి కూడా కలుగుతున్నది. నా మాట విని, మీ వంటకాలేవో చేసి పెట్టమని, మీ అమ్మతో చెప్పు," అన్నాడు.

ఉమ వెంటనే, "బాబుగారూ! అమ్మ అంతా మీ మేలుకోసమే చేస్తున్నది. మీరే చూడండి, వచ్చినప్పటికీ యిప్పటికీ మీ ఆరోగ్యం ఎంతో మెరుగయింది," అన్నది.

పేదరాలింట్లో వుంటున్న భూపతి గొప్ప జమీందారని ఊళ్ళో చాలామందికి తెలిసింది. కొందరాయనను చూడ వచ్చారు. వాళ్ళల్లో కొందరిని ఆయన విందుకాహ్వానించాడు. పేదరాలు వేరే వంటలు చేయలేక భూపతి తెచ్చుకున్న పచ్చళ్ళే వాళ్ళకు వడ్డించింది.

భోజనాలయాక, ఆ విందుకు వచ్చిన వాళ్ళలో నలుగురు పేదరాలితో, "ఈ రోజు నువ్వు వడ్డించిన పచ్చళ్ళు అద్భుతంగా వున్నాయి. వాటి రుచి మరిచి



పోవడం కష్టంగా వున్నది. నీకెంత డబ్బయినా యిస్తాం. అలాంటి పచ్చళ్ళు మాకు చేసి పెట్టాలి,'' అన్నారు.

పేదరాలు వాళ్ళతో, ''ఆ పచ్చళ్ళు జమీందారు భూపతిగారు వెంటతెచ్చుకున్నవి. అవి నేను చేసినవి కావు,'' అని చెప్పి పంపేసింది.

శ్రీపురంలో భూపతి ఆరోగ్యం బాగా మెరుగవడంవల్ల, ఆయన మరి రెండు వారాలు ఎక్కువగా అక్కడే వుండిపోయాడు. ఆయన్ను తీసుకుపోవడానికి బండి రాగానే, పేదరాలూ, ఉమా ఆయన వెంట తెచ్చిన సామానుతోపాటు, నిలవ వున్న పచ్చళ్ళ జాడీలను కూడా బండిలో పెట్టపోగా, భూపతి వాళ్ళను వారిస్తూ, ''ఇంకా అవెందుకు? ఇక్కడ అవసరపడతాయని తెచ్చుకున్నాను. అక్కడ యిలాంటివి చాలా వున్నాయి. కూడా తీసుకుపోవడం ఒట్టి మోతబరువు,'' అన్నాడు.

ఇది విని పేదరాలూ, కూతురూ ముఖం ముఖం చూసుకున్నారు.

భూపతి వెళ్ళిపోయాక వాళ్ళు జాడీల మూతలు తీసి చూస్తే, వాటిలో పచ్చళ్ళు యించుమించు అయిపోయాయి.

పేదరాలు బాధపడుతూ, ''జమీందారు వీటిని మనకు వదిలిపెడతాడని ముందే తెలిస్తే, ఎంతో బాగుండేది! తినడానికి బాగా వుండి, అమ్ముకుంటే డబ్బు తెచ్చిపెట్టే వీటిని మనమే వుంచుకుని, ఆయనకు నచ్చిన మన చౌకబారు వంటలు రోజూ చేసి పెట్టేదాన్ని!'' అన్నది.

''ఎంత శ్రమకు అంతే ఫలితం, అంటారు గదా! ఇప్పుడు విచారించి ఏం లాభం?'' అని నిట్టూర్చింది ఉమ.

కానీ జమీందారు భూపతి వాళ్ళను మరిచిపోలేదు. ఆయన వాళ్ళ ఊళ్ళో వుండగా ఉమకు తనే పెళ్ళి చేస్తానన్నాడు. నెల తిరక్కుండానే ఆయన ఒక నౌకరుతో విలువైన దుస్తులు పేదరాలికి పంపుతూ—ఆ మర్నాడే ఉమకు పెళ్ళి చూపులనీ, ఆమెను చక్కగా అలంకరించమనీ కబురు చేశాడు.






# నైపుణ్యం

సౌపర్ణుడు అనే ముని తన శిష్యుడితో కలిసి, మలయావతీ నగరానికి వెళుతూ, ఒక అరణ్యంగుండా ప్రయాణం చేస్తున్నాడు. ఒకచోట దారి రెండుగా విడిపోయింది. ఏదారి మలయావతీ నగరానికి వెళుతుందో తెలియక ముని ఆలోచిస్తూండగా, దూరంగా ఒక మర్రిచెట్టుకింద యిద్దరు యువకులు తీరిగ్గా కూర్చుని పాచికలాడుతూ కనిపించారు. గురుశిష్యులిద్దరూ అక్కడికి వెళ్ళి విశ్రమించారు.

పాచికలాడుతున్న యువకులు, వాళ్ళు రావడంగానీ, చెట్టుకింద విశ్రమించడంగానీ గమనించలేదు. కొంచెంసేపు విశ్రాంతి తర్వాత సౌపర్ణుడు, అక్కడి నుంచి బయలుదేరబోతూ, ఆ యువకులను మలయావతీ నగరానికి దారి అడిగాడు.

వాళ్ళిద్దరూ ఒక్కసారిగా సౌపర్ణుడివంకా, ఆయన శిష్యుడివంకా వింతగా చూసి, తిరిగి యథాప్రకారం ఆట ఆడడం ప్రారంభించారు.

సౌపర్ణుడు మరొకసారి, వాళ్ళను దారి అడగబోయేంతలో, ఆ ఇద్దరిలో ఒకడు, సౌపర్ణుడితో, ''అయ్యా, మీరు కుడివైపుగా వున్న దారిలో వెళ్ళండి. మలయావతీ నగరాన్ని చేరుకుంటారు,'' అన్నాడు.

అంతలో రెండవవాడు, అతన్ని వారిస్తూ, వాడు చెప్పింది నిజంకాదనీ, ఎడమవైపు దారిలో వెళితే మలయావతీ నగరం చేరుకోవచ్చనీ చెప్పాడు.

సౌపర్ణుడికి వాళ్ళ విచిత్ర ప్రవర్తన చాలా ఆశ్చర్యం కలిగించింది. వాళ్ళు చెరొకదారినీ సూచించేసరికి, ఏదారిలో వెళ్ళాలన్న సమస్య ఎదురైంది.

ఆయన కొద్దిసేపు ఆలోచించి వాళ్ళను, ''మలయావతిని పాలించే రాజెవరు?'' అని ప్రశ్నించాడు.

దాసరి వెంకటరమణ

ఇద్దరిలో ఒకడు, ''మలయావతిని పాలించే రాజు విష్ణుగుప్తుడు,'' అన్నాడు.

రెండవవాడు, ''మలయావతీ నగరానికి రాజు సర్వోత్తముడు,'' అన్నాడు.

ఇలా విరుద్ధమైనజవాబులు చెప్పి, వాళ్లు తిరిగి పాచికలాటలో మునిగిపోయారు.

సౌపర్ణుడు వాళ్ళను మళ్ళీ ఏమీ అడగకుండా, ఎడమవైపుగా వున్న దారిలో నడకసాగించాడు. నాలుగైదు కోసుల దూరం నడిచాక వాళ్ళకు మృణాళినీ నదీ, నదీతీరాన వున్న శక్తి ఆలయం, నదికి ఆవల కూతవేటు దూరంలో మలయావతీ నగర శివార్లూ కనిపించాయి.

గురుశిష్యులు నదిలో స్నానం చేసి, ఆలయంలో ఆదిశక్తిని దర్శించి, ఒక దిరిశెన వృక్షం నీడలో కూర్చున్నారు.

అడవిలో ఆ ఇద్దరు యువకులూ, చెరొకదారీ చెప్పినప్పటికీ, గురువుగారు సరిఅయినదారిని ఎలా గుర్తించగలిగారన్న సందేహం, శిష్యుణ్ణి వదల్లేదు. ఆ సందేహం గురించి గురువును అడిగాడు.

సౌపర్ణుడు చిరునవ్వునవ్వి, ''మొదట వాళ్ళు వేరువేరు దారులను చెప్పడంబట్టి, అందులో ఒకడు అబద్ధం చెబితే, మరొకడుసత్యంపలికేవాడని అర్థమైంది. అందువలన మనకు సమాధానం తెలిసిన ప్రశ్న అడిగాను. దానికి మొదటివాడు, మలయావతీనగర రాజు విష్ణుగుప్తుడనీ, రెండవవాడు సర్వోత్తముడనీ చెప్పారు. మలయావతీ నగరానికి రాజు సర్వోత్తముడని మనకు తెలుసు. ఆయన ఆహ్వాన కారణంగానే మనం, అక్కడికి వెళుతున్నాం. దీన్నిబట్టి సత్యం పలికేవాడు రెండవవాడని అర్థమైంది. అందువల్ల, వాడు చెప్పిన మార్గం వెంట వచ్చాము,'' అన్నాడు.

నగరం చేరాక సౌపర్ణుడు, శిష్యుడితో, ''సమాజంలో రకరకాల మనస్తత్వాలున్న వ్యక్తులుంటారు. వాళ్ళ మనసులను ఏమాత్రం నొప్పించకుండా, వాళ్ళద్వారా మన అవసరాలు తీర్చుకోవడం, తెలివితేటలతో కూడినపని. దానికి ఎంతో నైపుణ్యంకావాలి,'' అన్నాడు.






## 4

[సుమేధరాజ్య సేనాధిపతి వీరసింహుడు, రాజకుటుంబాన్ని సర్వనాశనం చేయడానికి కుట్ర పన్నాడు. రాజు శాంతిదేవుడు, రాణినీ, తన రెండేళ్ళ కుమారుణ్ణీ రహస్య సొరంగ మార్గం గుండా పంపి, శత్రువులతో వీరోచితంగా పోరాడి, నదిలో దూకేశాడు. అరణ్యమధ్యానికి చేరుకున్న రాణి, బిడ్డను జయానందమునికి అప్పగించి కళ్ళు మూసింది. తరవాత—]

జయానందముని, రాణిగారి మృతదేహం ముందు మౌనంగా కూర్చున్నాడు. అప్పుడే మర్రిచెట్టు కొమ్మ మీదికి వచ్చిన ఒక కోతి కిచకిచమని అరిచింది.

ముని తల పైకెత్తి, "రా, మారుతీ, దిగిరా. నీకొక కొత్త స్నేహితుడు వచ్చాడు, ఆడుకుందువుగాని," అన్నాడు.

కోతి ఒక్క గెంతున కిందికి దూకి ముని పక్కన వచ్చి కూర్చున్నది.

"మారుతీ, నువ్వు వెళ్ళి, వెంటనే భల్లూకిని వెంటబెట్టుకునిరా. నీ మిత్రుణ్ణి ఆమెకు అప్పగించాలి," అన్నాడు ముని చిన్నగా నవ్వుతూ.

కోతి ఆనందంగా లేచి, ఒక చెట్టుపై నుంచి మరొక చెట్టుమీదికి గెంతుతూ వెళ్ళిపోయింది.

యువరాజుకు తన తల్లి మరణించిందన్న విషయం తెలియదు కాబట్టి,



నవ్వుతూ తల్లి ముఖం కేసీ, ముని కేసీ చూడసాగాడు.

అప్పుడు ముని, "నువ్వు చాలా ధైర్యవంతుడివి. జీవితంలో మునుముందు ఎంతో సాధించాలి. తల్లికోసం బెంగపెట్టుకోకుండా, పెరిగి పెద్దవాడివై, ఆమె మరణానికి కారకులయిన పాపులను తగిన విధంగా శిక్షించాలి," అన్నాడు.

ఆ మాటలేవీ వినిపించుకోకుండా యువరాజు నవ్వుతూ, ముని గడ్డంతో ఆడుకోసాగాడు. ముని బిడ్డను చేతుల్లోకి ఎత్తుకుని, "నీ కంఠహారాన్ని తీసుకుంటున్నాను. హారంలోని పతకం చూస్తే, నువ్వు రాజకుమారుడివన్న సంగతి తెలిసిపోతుంది. అది క్షేమం కాదు," అంటూ బిడ్డ మెడలోని కంఠహారాన్ని మెల్లగా తీసుకున్నాడు.

ఇంతలో మారుతి అమితోత్సాహంతో, ఎక్కడలేని హడావుడి చేస్తూ, అరుస్తూ అక్కడికి వచ్చింది. తోకతో చెట్టుకొమ్మను ఒడిసి పట్టుకుని తల్లకిందులుగా వేలాడుతూ కుర్రవాణ్ణి నవ్వించడానికి ప్రయత్నించసాగింది. మారుతితోపాటు ఒక ఎలుగుబంటి కూడా వచ్చింది.

ముని ఎలుగుబంటితో, "భల్లూకీ, ఈ బిడ్డను జాగ్రత్తగా కాపాడడం నీవంతు," అంటూ యువరాజును చూపాడు.

ఎలుగుబంటి యువరాజుకేసి చేతులు సాచింది. దాని దగ్గిరికి వెళ్ళడానికి యువరాజు కాస్త భయపడ్డాడు. దానిని గ్రహించి ముని యువరాజుతో, "భల్లూకి చాలా మంచిది నాయనా, నిన్ను తల్లిలా కాపాడుతుంది. నువ్వు కోరినది ఇస్తుంది. రోజూ తప్పకుండా స్నానం చేస్తుంది. అందువల్ల ఆమె ఎంతో శుభ్రంగా వుంటుంది. నిర్భయంగా ఆమె దగ్గిరికి వెళ్ళు," అన్నాడు చిన్నగా నవ్వుతూ.

భల్లూకి రమ్మన్నట్టు తలాడించింది. యువరాజు మెల్లగా ఎలుగుబంటి కేసి నడిచాడు.

ముని ఎలుగుబంటినే కాదు; ఏ మృగాన్నయినా సరే సులభంగా మచ్చిక

చేసుకోగలడు. భయంకరమైన పులులనూ, సింహాలనూ సైతం ఆయన క్షణాలలో తన వశం చేసుకోగలడు. అంతేకాదు; వన్యమృగాలనన్నిటినీ తన అదుపు ఆజ్ఞలలో వుంచుకునే అపూర్వశక్తి ఆయనకున్నది. అయినా, ఈ విషయం అందరికీ తెలియదు. కావాలనే ఆయన ఆ సంగతిని రహస్యంగా దాచాడు.

ఆశ్రమంలో ఆయనతోపాటు శేఖరుడు, గోవిందుడు అనే ఇద్దరు శిష్యులు మాత్రమే వున్నారు. ధ్యాన పద్ధతులనూ, యోగాన్నీ అభ్యసిస్తూ, వాళ్ళు గురువుకు సేవలు చేస్తూ కాలం గడుపుతున్నారు. నిజానికి మునికి ఎలాంటి మానవ సహాయమూ అవసరంలేదు. ఎందుకంటే ఆయన కనుసన్నలలో మెలగడానికీ, కావలసిన పనులు చేసి పెట్టడానికీ వన్యమృగాలన్నీ సిద్ధంగా వున్నాయి.

శిష్యులిద్దరూ, యువరాజు జన్మదిన వేడుకలను చూడడానికి రాజధానీ నగరానికి వెళ్ళారు.

అప్యాయంగా చేతులు సాచిన భల్లూకి అనురాగానికి ముగ్ధుడై యువరాజు చిన్నగా నవ్వుతూ దానిని సమీపించాడు. అది వెంటనే బిడ్డను చంకకెత్తుకుని, వెనుతిరిగి ముందుకు నడిచింది. మారుతి పట్టరాని ఆనందంతో నాట్యం చేస్తూ దాని వెంట బయలుదేరింది.

ముని సంతోషంగా, ఆ దృశ్యం కేసి చూస్తూ కొంతసేపు అలాగే నిలబడ్డాడు.





వాళ్ళు కనుమరుగయ్యాక, ఆయన దృష్టి రాణిగారి కాయంమీదికి మళ్ళడంతో, ఆయన హృదయం మళ్ళీ విచారంతో నిండి పోయింది.

సూర్యోదయమై నాలుగు దిక్కులూ తెల్లబడ్డాయి. పక్షుల కిలకిల ధ్వనులు ఎక్కువయ్యాయి.

ఇంతలో శిష్యులిద్దరూ ఎంతో ఆదుర్దాగా గురువు వద్దకు వచ్చారు.

"ఏమిటి విశేషాలు?" అన్నట్టు చూశాడు ముని.

"చాలా విషాదకరమైన వార్తను తీసుకు వచ్చాము గురుదేవా, రాజకుటుంబం ఆపదలపాలయింది. రాజుగారు మరణించారన్న వదంతులు ప్రబలాయి!" అన్నాడు శేఖరుడు.

"రాణిగారు ఏమయ్యారో, ఎక్కడికి వెళ్ళారో, ఎవ్వరికీ తెలియదు," అన్నాడు గోవిందుడు.

మునిగాఢంగా నిట్టూర్చి, ఎడమవైపుకు తిరిగాడు. శిష్యులిద్దరూ ఆ వైపుకేసి చూసి ఆశ్చర్యంతో ఒక్క అడుగు వెనక్కు వేశారు. ఆ తరవాత తేరుకుని, రాణిగారిని సమీపించి చూసి, "రాణి మరణించిందా?" అని అడిగారు.

"అవును, శత్రువుల కత్తి నుంచి తప్పించుకున్నది గాని, ప్రాణసమానమైన రాజు నుంచి హఠాత్తుగా దూరమయ్యామన్న అదురుపాటును రాణి భరించలేక పోయింది. ఇక్కడికి వచ్చి, బిడ్డను మనకు అప్పగించి శాశ్వతంగా కళ్ళు మూసింది! యువరాజును ఇప్పుడే భల్లూకి తీసుకు వెళ్ళింది," అన్నాడు ముని.

శేఖరుడు గట్టిగా నిట్టూర్చి, "వివాహ మహోత్సవంలో రాణిగారిని మొట్ట మొదట చూశాను. మూడు నాలుగేళ్ళు గడిచిపోయినా, ఆమె రూపంలో ఎటువంటి మార్పూ కనిపించడం లేదు," అన్నాడు.

"రాజుగారి లాగానే రాణిగారు కూడా ప్రజలపట్ల ఎంతో కరుణ చూపేవారని



యదు. ఎందుకయినా, రాణిగారి మరణ వార్తను రహస్యంగా వుంచడం మంచిది.'' అన్నాడు ముని.

''మరణవార్త తెలిసినంత మాత్రాన శత్రువులు ఏం చేయగలరు? అసలు ఆమె ప్రాణాలతో లేదుకదా!'' అని అడిగాడు శేఖరుడు.

''రాణిగారినేమీ చేయలేరన్న మాట వాస్తవమే. కాని ఆమె ఈ ప్రాంతంలో మరణించిందని తెలియగానే, యువరాజు కోసం వెతికించవచ్చు; వాళ్ళు బిడ్డకు అపకారం తలపెట్టవచ్చుకదా!'' అన్నాడు ముని.

అందరూ చెప్పుకుంటారు. అటువంటి వారికి ఇలాంటి దుస్థితి ఏర్పడడం ఘోరం,'' అన్నాడు గోవిందుడు.

''రాణి మనపట్ల చూపిన నమ్మకాన్ని వృథా చేయకూడదు. ఆమె బిడ్డను శ్రద్ధగా పెంచి పెద్ద చేయడం మన బాధ్యత.'' అన్నాడు ముని.

''మీ ఆజ్ఞను శిరసా వహిస్తాము, గురుదేవా,'' అన్నారు శిష్యులిద్దరూ ముక్తకంఠంతో.

''ఇప్పుడు రాణిగారి భౌతిక కాయం సంగతి ఆలోచించాలి. రాజు ఏమయ్యాడో, ఎక్కడున్నాడో తెలియదు. శత్రువుల బలం ఎటువంటిదో కూడా మనకు తెలి

''నిజమే గురుదేవా. మరి ఇప్పుడు రాణిగారి మృతదేహాన్ని దహనంచేయాలా? సమాధి చేయాలా?'' అని అడిగారు శిష్యులిద్దరూ.

''అది రాణి అభీష్టానుసారమే జరగాలి ఆమె కోరిక ఏమిటో తెలుసుకోవాలి!'' అని, ముని మౌనంగా వాగులో స్నానం చేసివచ్చి, రాణిగారి మృతదేహం పక్కన ధ్యానంలో కూర్చున్నాడు. కొంత సేపయ్యాక కళ్ళు తెరిచి, ''ఆమె కాయాన్ని సమాధి చేయాలనే రాణి ఆత్మ కోరుతున్నది. పైగా భూస్థాపితం చేయడానికి ముందు, తన శరీరం మీద తన కుమారుడి చేత కొన్ని పువ్వులు ఉంచమని

కూడా ఆమె కోరింది. ప్రాణం పోయిన వెంటనే కాయాన్ని పాతిపెట్టడం శుభం కాదు. ఎందుకంటే భౌతిక కాయం చుట్టూ కొంతకాలం ఒక విధమైన అదృశ్య ప్రకాశం వుంటుంది. అది మాయమయ్యే వరకు శరీరాన్ని అలాగే వుంచాలి. కాబట్టి సూర్యాస్తమయం వరకు ఈ కాయం ఇక్కడే వుండాలి. మీరు ఇక్కడే వుండండి,'' అన్నాడు ముని.

''కట్టెలు కొట్టేవాళ్ళెవరయినా ఇటు వైపువస్తే రహస్యం బయటపడుతుందికదా గురుదేవా ?'' అని అడిగారు శిష్యులు.

''అదీ నిజమే. వాళ్ళేమో మంచివాళ్ళే. అయినా ఈ విషయంలో మనం ఏమాత్రం అజాగ్రత్త వహించకూడదు,'' అంటూ ముని కళ్ళు మూసుకుని ఏదో మంత్రం జపించాడు. మరుక్షణమే దూరంగా పులుల గాండ్రింపు వినిపించింది. మరి కొంతసేపటికి ఆ ధ్వనులు దగ్గరయ్యాయి. భయంకరమైన ఒక మగపులీ, ఒక ఆడ పులీ, మూడు పులి పిల్లలూ అక్కడికి వచ్చాయి. పెద్ద పులులు రెండూ తలలను ముని పాదాలకు తాకించాయి. పులి కూనలు మూడూ సంతోషంగా గెంతుతూ ముని దగ్గరికి వచ్చాయి. రెండు పిల్లలను ఆయన చేతులలోకి తీసుకున్నాడు. మూడవ పులిపిల్ల ఎగిరి ముని భుజం మీద కూర్చున్నది.

పులులతో ముని, ''సూర్యాస్తమయం వరకు మీరిక్కడే వుండి, అప్పుడప్పుడూ గాండ్రిస్తూ వుండాలి. మానవమాత్రులెవరూ ఈ దరిదాపులకు రాకూడదు. ఇక్కడ వున్న ఈ శవం ఎవరికంటా పడకూడదు. తెలిసిందా,'' అన్నాడు.

''అలాగే,'' అన్నట్టు పులులు రెండూ మెల్లగా గాండ్రిస్తూ తలలూపాయి.

ముని శిష్యులవైపు తిరిగి, ''ఇప్పుడు మనం సరైన స్థలంలో గొయ్యి సిద్ధం చేయాలి. ఈలోగా రాణి కాయం మీద పువ్వులు వుంచడానికి, యువరాజును కూడా ఇక్కడికి తీసుకురావాలి,'' అన్నాడు. —(ఇంకావుంది)





# పరమలోభి

పూర్వం రష్యాదేశంలో మార్క్ అనే, సంపన్నుడుండేవాడు. అతనివంటి పరమ లోభి ప్రపంచంలో లేడనుకునేవారు. ఒక నాడు మార్క్ వీధివెంట పోతూండగా వృద్ధు డొకడు కనిపించి, ''అరగానీ ధర్మం చెయ్యండి, బాబూ!'' అని అడిగాడు.

బిచ్చగాడి ఆర్తనాదాన్ని మార్క్ విని పించుకోలేదుగాని, తన వెనకనే వస్తున్న పేదరైతొకడు జేబులో నుంచి ఒక అరగానీ తీసి బిచ్చగాడికి ఇవ్వటం గమనించాడు.

అది చూసి, మార్క్‌కు సిగ్గయింది. ఆయన ఆగి పేదరైతుకేసి తిరిగి, ''చూడబ్బీ, నా దగ్గిర చిల్లర లేదుగాని, ముష్టివాడికివ్వటానికి ఒక అరగానీ ఉంటే బదులిస్తావ్? నే నెవరో తెలుసుగా?'' అన్నాడు.

పేదరైతు, అరగానీ తీసి మార్క్‌కిస్తూ, ''చిత్తం, దీనికోసం తమ రెప్పుడు కనిపించమన్నారు?'' అని అడిగాడు వినయంగా.

''రేపు రా!'' అన్నాడు మార్క్.

మర్నాడు పేదరైతు మార్క్ ఇంటికి వెళ్ళాడు. అతన్ని చూడగానే మార్క్, ''అరగానీ కోసం వచ్చావా? నా దగ్గిర సమయానికి చిల్లరలేదే. రేపు కనిపిస్తావా ఏమిటి?'' అన్నాడు.

ఆ మర్నాడు రైతు మళ్ళా వచ్చాడు.

''పాపం, నువొచ్చావుగాని, నా దగ్గిర సమయానికి చిల్లరడబ్బులు లేకుండా ఉన్నాయి. ఒక పని చెయ్యి. నీ దగ్గిర తొంభైతొమ్మిది రూపాయల పదిహేనణాల ముక్కానీ అరగానీ ఉంటే చూడు. ఏకంగా నూరురూపాయలనోటు పట్టుకుపోదువుగాని.'' అన్నాడు మార్క్.

తన దగ్గిర అంతమొత్తం లేదన్నాడు పేదరైతు.

రష్యా జానపద కథ

"అలా అయితే రెండు వారాలు దాటి కనబడు," అన్నాడు మార్కా.

ఆ ప్రకారమే పేదరైతు రెండు వారాలాగి మళ్ళీ వచ్చాడు. అతను అంత దూరాన ఉండగానే చూసిన మార్కా తన భార్యతో, "ఏమే, నేను చాపమీద పడుకుంటాను. నా మీద గుడ్డ కప్పేసి తల దగ్గిర దీపం పెట్టు. నా కోసం పేదరైతు వస్తున్నాడు, తెల్లారి చచ్చిపోయానని చెప్పెయ్యి. ఈ పీడ విరగడవుతుంది," అన్నాడు.



మార్కా చెప్పినదంతా భార్య చేసింది. తరవాత భర్త దగ్గిర కూచుని కుమిలి కుమిలి ఏడవసాగింది. పేదరైతు రాగానే, "నీ మాటే అనుకుంటూ పోయాడు, నాయనా!" అని శోకాలు పెట్టింది.

"పోక పోక నా రుణానే పోయాడా, పాపాత్ముడు? కానీ ఏం చేస్తాం? ఖర్చులో మరింత ఖర్చు. ఈయనకు ఉత్తరక్రియలు నేనే చేయిస్తాను. శవానికి స్నానం చేయించాలి," అంటూ పేదరైతు పెరట్లోకి వెళ్ళి గంగాళంలో మసిలే వేడి నీళ్ళు బొక్కెనతో తెచ్చి మార్కా మీద కుమ్మరించాడు. ఆ బాధకు మార్కా కాళ్ళు కదిలించాడు.

"కాళ్లు ఝాడించటం కాదు. ఇప్పుడైనా నా అరగానీ నా మొహాన, పారేస్తావా?" అన్నాడు పేదరైతు కోపంగా. మార్కా వద్ద నుంచి జవాబు లేదు.

"శవాన్ని పెట్టటానికి పెట్టె తెప్పించండి. గుడికి మోయించుకు వెళ్ళి అక్కడ అభిషేకాలు చేయించి తరవాత శ్మశానంలో సమాధి చేయిస్తాను," అన్నాడు పేదరైతు. మార్కా భార్య మారుమాటాడకుండా శవపేటిక తెప్పించింది. పేదరైతు పెట్టెలో మార్కాను పెట్టించి ఆలయానికి తీసుకువెళ్ళాడు. అక్కడ చీకటిపడేదాకా పూజలూ, అభిషేకాలూ చేయించి, పేదరైతు అక్కడే ఉండిపోయాడు.

అర్ధరాత్రివేళ నలుగురు దొంగలు ఆలయంలో ప్రవేశించారు. వాళ్ళ అలికిడి

విని పేదరైతు విగ్రహం వెనక దాక్కున్నాడు. దొంగలు ఎక్కడినుంచో బోలెడంత డబ్బూ, నగలూ తెచ్చారు. వాటిని గుడిమధ్య పరిచి పంచుకోసాగారు.

నగలూ, నాణ్యాల పంపకం యావత్తూ ముగిసినాక వాళ్ళవద్ద బంగారుపిడి గల ఒక కత్తి మాత్రం మిగిలింది.

దాన్ని ఎవరు తీసుకోవాలో దొంగలకు తేలలేదు. అది నాదంటే నాదని వాళ్ళు ఘర్షణ పడసాగారు.

''కత్తికోసం ఎందుకు పోట్లాడుకుంటారు. ఆ పెట్టెలో ఉన్న శవం మెడ ఎవరుకోస్తే ఆ కత్తి వారిదే,'' అన్నాడు పేదరైతు విగ్రహం వెనకనుంచి.

ఈ మాట వినేసరికి మార్కా తుళ్ళిపడి లేచి నిలబడి, ''అమ్మయ్యో నా గొంతే?'' అని చావుకేక పెట్టాడు. ఇదంతా చూసి దొంగలకు గుండెలు బద్దలైపోయాయి. వాళ్ళు ధనాన్ని కూడా మరిచిపోయి, ప్రాణాలు దక్కించుకునేటందుకు పారిపోయారు.

అప్పుడు పేదరైతు విగ్రహం చాటునుంచి ధైర్యంగా బయటికొచ్చాడు.

''చూడవోయ్, అయిందేదో అయిపోయింది. నీకూ నాకూ పేచీ దేనికి? మన అదృష్టం బాగుండి ఇంత సొమ్ము మన పాలపడింది. మూడోకంటివాడికి తెలియకుండా దీన్ని న్యాయంగా, సమంగా పంచుకుందాం, పట్టు!'' అన్నాడు మార్కా పేదరైతుతో.

పేదరైతు సరేనన్నాడు. దొంగలు విడిచిపోయిన సొమ్ము యావత్తూ సమంగా పంచుకున్నారు.

''ఇక పోదాం పద!'' అన్నాడు మార్కా.

''మరి నా అరగానీ మాటేమిటి?'' అన్నాడు పేదరైతు.

''చూస్తూనే ఉన్నావుగా? నా దగ్గర చిల్లర లేదే? రేపు తప్పకుండా కనపడు,'' అన్నాడు మార్కా.

చాలా రేపులు గడిచాయిగాని, రైతుకు ఆ అరగానీ తిరిగి ముట్టనేలేదు.






# రహస్యనిధి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, భీతికొలిపే ఈ అర్ధరాత్రివేళ, నువ్వు దేనిని సాధించడానికి ఇంత శ్రమపడుతున్నావో నాకు తెలియదు. అయితే, ఏదైనా రహస్య నిధిని చేజిక్కించుకోవడానికైతే మాత్రం, ఇంతశ్రమపడనవసరంలేదని గ్రహించడం మంచిది. ఎందుకంటే, రహస్యనిధులను చేజిక్కించుకోవడం అంత సులభంకాదు. పైగా, గుప్తధనాలు కొందరిని ఆకర్షిస్తాయి తప్ప, చేతికి అందవు. మరికొందరికైతే ఎటువంటి శ్రమా లేకుండానే, లభిస్తాయి. ఇందుకు ఉదాహరణగా శ్రీకరుడనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



కనకపురి, ధాన్యపురి, సప్తభూమి అనే మూడు రాజ్యాలను కలుపుతూ ఒక మహారణ్యం వుండేది. వందలాది సంవత్సరాలుగా ఆ మహారణ్యం రెండు ముఠాల బందిపోటు దొంగలకు స్థావరంగా వుండేది. ఆ దొంగలు మూడు రాజ్యాలలోని ఊళ్ళపై బడి దోచుకుని, అరణ్యమధ్యానికి పారిపోయేవారు. కొన్నేళ్ళ తరవాత, క్రమేణా దొంగల బెడద తగ్గిపోయింది. నాయకులు మరణించడంతో, మిగిలిన దొంగలు సహజ జీవనానికి అలవాటుపడి, అక్కడక్కడా స్థిరపడిపోయారు.

కనకపురి రాజ్యాన్ని శ్రీకరుడనే రాజు, యువకుడైనప్పటికీ ఎంతో ధర్మబద్ధంగా పరిపాలించేవాడు. ప్రజాక్షేమంకోసం ఆయన చేయగలిగినదల్లా చేశాడు. అయినా, ఆ రాజ్యంలో ప్రవహించే సాముద్రికానది వర్షాకాలంలో పొంగి, వందలాది ఎకరాల పంటలను జలమయం చేసేది. ఆ నది వరదలనుంచి పంటలను కాపాడాలంటే, కొంతదూరం నది గట్టులను బలపరచడం తప్ప మరొక మార్గం లేదు. దానికి చాలా ధనవ్యయం అవుతుంది. ప్రజాకార్యమే కాబట్టి ఉచితంగా పనిచేయమని రాజు ప్రజలను ఆజ్ఞాపించవచ్చు. అయితే, అది రాజుకు ఇష్టంలేదు. పైగా, రాజ్యంలోని పౌరులు మాత్రమే ఆ పని పూర్తిచేయడానికి చాలరు. పొరుగు రాజ్యం నుంచి కొందరిని రప్పించవలసి వుంటుంది.

రాజు ఈ విషయం గురించి తీవ్రంగా ఆలోచిస్తూండగా, ఆయనకు ఒక వార్త తెలిసింది: ధాన్యపురి రాజు వేటకోసం అడవికి వెళ్ళి, అక్కడ పాము కాటుకు గురై ప్రాణాలు కోల్పోయాడు. రాజు మరణం కారణంగా ఆ రాజ్యం అరాచకానికి లోనయింది!

ఏడు రోజుల తరవాత, మరొక వార్త తెలిసింది. అదేమిటంటే—సప్తభూమి రాజు కూడా వేటాడడానికి అరణ్యానికి వెళ్ళి, పులి వాతపడి మరణించాడు!

రాజుకు ఆ వార్త తెలియజేసిన మంత్రి, "రాజా, ఇది మనకొక అపూర్వ అవకాశం. ప్రయత్నిస్తే ఒక్కసారిగా రెండు రాజ్యాలనూ మన రాజ్యంతో కలుపుకోవచ్చు. ఆ రాజ్యాలలోని ధనంతో సాముద్రికా నది గట్టును బలపరచ వచ్చు. వెంటనే యుద్ధ సన్నాహాలు ప్రారంభిద్దాం," అన్నాడు.



శ్రీకరుడికి కూడా ఈ సలహా నచ్చింది. అయితే, కనకపురిలో అందుకు కావలసిన సైనికబలం లేదు. సైనికబలం పెంచడానికి కూడా ధనం కావాలి కదా!

ఈ సమయంలో, రహస్య నిధులను గురించి తెలియజేసే దైవజ్ఞుడొకడు రాజధానీ నగరానికి వచ్చాడు. రాజు దైవజ్ఞుణ్ణి సంప్రదించాడు. అరణ్యం మధ్య ఒక గుహలో బంగారమూ, నగలూ వున్నాయనీ, అయితే ఆ నిధిని చేపట్టడం చాలా అపాయకరమనీ దైవజ్ఞుడు చెప్పాడు.

రహస్య నిధులకు మానవాతీతశక్తులు కాపలా వుంటాయనీ, తన అధికారం వాటి ముందు చెల్లదనీ గ్రహించిన శ్రీకరుడు, ఒంటరిగా గుర్రం మీద బయలుదేరి అరణ్యం మధ్యకు చేరాడు. అక్కడొక కుటీరం కనిపించింది. రాజు లోపలికి తొంగి చూశాడు. ఒక ముని ధ్యానంలో వున్నాడు. రాజు లోపలికి వెళ్ళి, మునికి మౌనంగా నమస్కరిస్తూ నిలబడ్డాడు. కొంతసేపటికి ముని కళ్ళు తెరిచి, "ఎవరు నువ్వు? ఏం కావాలి నాయనా," అని అడిగాడు.

"మహాత్మా, నేను కనకపురి రాజు శ్రీకరుణ్ణి. ఈ గుహలో నిధి ఉన్నదని తెలిసి వచ్చాను. అక్కడ నిధి వున్నమాట నిజమేనా," అని అడిగాడు రాజు వినయంగా.

"అవును, నిజమే. కొన్నేళ్ళ క్రితం ఆ నిధిని, కొందరు దొంగలు, మునీశ్వరులయిన మా గురువుకు అప్పగించారు," అన్నాడు ముని.

"అయితే, ఇప్పుడా నిధి తమ రక్షణలోనే ఉన్నదా మహాత్మా!" అని అడిగాడు రాజు.



లన్న కోరికతో సప్తభూమి రాజు గుహలో ప్రవేశించాడు. కాని, పులి వాతపడ్డాడు. అయినా, నీలో ఏ కోశానా భయం లేకుంటే, పాము గాని, పులి గాని నిన్నేమీ చేయలేవు," అన్నాడు ముని.

"నాకు భయమన్నది లేదు మహాత్మా," అని శ్రీకరుడు మునికి నమస్కరించి గుహ కేసి నడిచాడు.

అయన గుహలో అడుగు పెట్టగానే పాము బుస్సుమన్నది. రాజు ఒక్క క్షణం అలాగే నిలబడి, వెనుదిరిగి రాజధాని చేరుకున్నాడు.

శ్రీకరుడు మరునాడే తన దూతల ద్వారా, దుఃఖంతో వున్న ధాన్యపురి, సప్తభూమి రాజకుటుంబాలకు తన సానుభూతిని తెలియజేశాడు. ఈ క్లిష్టపరిస్థితిలో ఎటువంటి సహాయం కావాలన్నా చేయడానికి సిద్ధంగా వున్నట్టు వారికి తెలియచేశాడు. రెండు రాజ్యాల రాణులూ, మంత్రులూ శ్రీకరుడి ఔదార్యానికి ఆనందించి, తమ కృతజ్ఞతలు తెలియజేశారు. తమ యువరాజుల పట్టాభిషేక ఉత్సవాలకు రమ్మని ఆహ్వానాలు పంపారు.

వారం రోజులు గడిచాక, శ్రీకరుడు మళ్ళీ అడవికి బయలుదేరాడు. కుటీరంలోని మునికి నమస్కరించి, "మహాత్మా, ఈ రోజు నేను గుహలోని నిధిని

"అది నా రక్షణలో లేదు. దానిని ఒక సర్పమూ, పులీ కాపలా కాస్తున్నవి," అన్నాడు ముని.

ధాన్యపురి రాజూ, సప్తభూమి రాజూ అరణ్యమధ్యంలో పాముకాటుకూ, పులి దెబ్బకూ గురికావడం, శ్రీకరుడికి జ్ఞాపకం వచ్చి, ఆ విషయం మునికి చెప్పాడు.

"అవును, నిజమే. ధాన్యపురి రాజు కనకపురిని జయించాలన్న కోరికతో, సైన్య సమీకరణకు ధనం కావాలని ఈ గుహను సమీపించాడు. పాము కాటు వేసింది. రాజును కోల్పోయి అల్లకల్లోలంగా వున్న ధాన్యపురిని కబళించడానికి సైన్య సమీకరణకు ధనం సంపాదించా

చేజిక్కించుకోబోతున్నాను. నన్ను ఆశీర్వదించండి,'' అన్నాడు వినయంగా.

ముని సంతోషంగా ఆశీర్వదించాడు.

శ్రీకరుడు ధైర్యంగా గుహలో అడుగు పెట్టాడు. మొదట పాము బుస్సుమన్నది. ఆ తరవాత పులి గాండ్రించింది. కాని, రెండూ రాజును సమీపించాయి తప్ప, ఆయనకు ఎటువంటి హానీ చేయలేదు.

రాజు గుహలో ధాన్యపురాశిలా వున్న ఆభరణాలనుంచి, ఒకదానిని చేతిలోకి తీసుకుని వెలుపలికి వచ్చి, తన భటులను వెంటబెట్టుకుని వెళ్ళి, నిధిని రాజధానికి తరలించాడు. ఆనాటినుంచి, అక్కడ పులీ, పామూ కనిపించలేదు.

ఆ తరవాత, కుటీరంలోని ముని అనుమతితో ఆయన గురువు సమాధిపై గుడి కట్టించాడు రాజు. మిగిలిన ధనాన్ని సాముద్రికానదికి ఎత్తయిన గట్టు వేయడానికి వినియోగించాడు. ఆనాటినుంచి యేటా వచ్చే వరదలబెడద పోయి, కనకపురి రాజ్యం సుసంపన్న మయింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, ధాన్యపురి రాజును కాటు వేసిన సర్పం, సప్తభూమి రాజును ఎందుకు వదిలి పెట్టింది? పాము వదిలిపెట్టినా సప్తభూమి రాజును పులి ఎందుకు చంపింది? పామూ, పులీ రెండూ, కనకపురి రాజును



వదిలిపెట్టడం కేవలం ఆయన అదృష్టమా? లేక దీనివెనుక ఏదైనా రహస్యం ఉన్నదా? పైగా, గుహలోపలికి వెళ్ళడానికి మొదట భయపడిన శ్రీకరుడు, ఆ తరవాత ఎలా ధైర్యం తెచ్చుకోగలిగాడు? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఈ రహస్య నిధి చాలా మహిమగలది అన్న విషయం మరిచిపోకూడదు. ఎందుకంటే తాము దోచుకున్న ధనాన్ని, దొంగలు మునికి అప్పగించారు. అది దొంగల హృదయ పరివర్తనను సూచిస్తుంది. పైపెచ్చు, ఆ ధనం ప్రజోపయోగకార్యాలకు ఉపయోగ

పడాలని మునీశ్వరుడు సంకల్పించి వుండ వచ్చు. ఇక, కనకపురిని శ్రీకరుడు ధర్మ బద్ధంగా పరిపాలిస్తున్నాడని తెలిసి కూడా, ధాన్యపురి రాజు నీచమైన కోర్కెతో, స్వార్థబుద్ధితో కనకపురిని ఆక్రమించుకో వాలని చూశాడు. అందుకే అతన్ని పాము కాటు వేసింది. సప్తభూమి రాజు అంత నీచుడు కాదు కాని, ధాన్యపురి రాజు మరణించాడని తెలియగానే, ఆపరిస్థితిని తనకు అనుకూలంగా ఉపయోగించుకో వాలన్న స్వార్థంతో ఉబలాటపడ్డాడు. అందువల్లనే పాము వదిలినా, పులి అతన్ని చంపివేసింది.

ఇక శ్రీకరుడి సంగతి: ఆయన తన ప్రజల మేలుకోరి నదికి గట్టు వేయాలను కున్నాడు. అదే అతని ప్రధానమైన కోరిక. కాని ఆ పిమ్మట, పొరుగురాజులు మరణిం చడంతో, మంత్రి ప్రోద్బలంతో, ఆ రాజ్యా లను వశపరచుకోవాలన్న కోరిక కలిగింది. ఆయన స్వతహాగా ధర్మబుద్ధి గలవాడు కావడంవల్ల, లోలోపల తప్పు చేస్తున్నా నన్న భావం ఏర్పడి వుంటుంది. అందు వల్లే, ఆయన మొదట గుహలో ప్రవేశించి నప్పుడు, పాము బుసకొట్టడంతో కాస్త భయపడ్డాడు; ముందుకు అడుగు వేయ లేకపోయాడు. ఆ క్షణం నుంచి, ఆయన పొరుగురాజ్యాలను ఆక్రమించాలన్న కోర్కెను వదులుకున్నాడు. వారిపట్ల మైత్రీభావం వ్యక్తం చేశాడు. ఇప్పుడు ఆయనకున్న ఒకటే కోరిక—ప్రజాక్షేమం కోసం, నదికి గట్టు వేయించడానికి రహస్యనిధిని ఉపయోగించాలన్నదే. ఉద్దేశం ఉదాత్తమైనది కాబట్టి, రెండవ సారి గుహలోకి అడుగు పెట్టినప్పుడు ఆయనలో ఎటువంటి భయమూ ఏర్పడ లేదు. ముని సంకల్పం నెరవేరడం వల్ల, పామూ, పులీ ఎలాంటి హానీ చేయలేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: మనోజ్ దాస్ రచన]



# చందమామ అనుబంధం—14

## మన విజ్ఞాన సంపద

### ఎవరాయన?

నగరం నాలుగు వీధులు కలిసే జనసమ్మర్దం గల చోట, పట్టపగలులో చేత దీపం పట్టుకుని, వచ్చేపోయేవారిని, పరిశీలించి చూడసాగాడొక తత్వవేత్త!

వింతగా ప్రవర్తించే ఆ తత్వవేత్తను గురించి, ఆ గ్రీసునగర పౌరులందరికీ తెలుసు. కాని, ఈ చర్య వారికి మరింత విడ్డూరంగా కనిపించింది. కొందరు ఆయనను సమీపించి, "పట్టపగలు చేత దీపంతో ఎందుకలా వెదుకుతున్నారు?" అని అడిగారు.

"మనిషి కోసం వెతుకుతున్నాను!" అన్నాడా తత్వవేత్త!

"మనిషి కోసమా? అదేమిటి, మీ చుట్టూ ఉన్న వీళ్ళందరూ మనుషులు కారా?" అని ప్రశ్నించారు పౌరులు.

"నోటికి వచ్చినట్టు మాట్లాడుతూ, ఇష్టానుసారం ప్రవర్తించేవాళ్ళు, రెండు కాళ్ళతో నడిచినంత మాత్రాన మనుషులవుతారా?" అని ఎదురు ప్రశ్న వేశాడా తత్వవేత్త!

ఆయన ఎవరో మీకు తెలుసా? (36 వ పేజీ చూడండి)

### మీకు తెలుసా?

1. ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించిన మొట్టమొదటి వనిత ఎవరు?
2. భారతదేశ భూభాగాన్ని జపాను ఎప్పుడయినా జయించిందా?
3. 'నైలాన్' అనే మాట ఎలా ఏర్పడింది?
4. ప్లూటో గ్రహాన్ని ఎవరు ఎప్పుడు, కనుగొన్నారు?
5. సముద్రంలో మునిగిపోయిన 'లాస్ట్ అట్లాంటిస్' నాగరికతను గురించి మొట్టమొదట ప్రస్తావించిన వారెవరు?
6. ఎద్దు అస్థిపంజరమూ, మేక వెంట్రుకలూ, గుర్రం తోకా, ఆవు తలా కలిసి పందిలా గుర్రుపెట్టే జంతువు ఏది?

(36 వ పేజీ చూడండి)

# ప్రజాస్వామ్యం వెలసిన వైశాలీ నగరం!




మన దేశంలో ఆధునిక కాలంలోనే ప్రజాస్వామ్యవ్యవస్థప్రారంభమయిందని మీరనుకుంటున్నారా? ప్రజా స్వామ్య హక్కులు మన కాలంలోనే ఏర్పడ్డాయని మీరు భావిస్తున్నారా? నిజానికి ప్రజాస్వామ్యం మన దేశానికి కొత్తకాదు. దాదాపు రెండువేల సంవత్సరాలకు పూర్వమే భారతదేశంలో అక్కడక్కడ కొన్ని ప్రాంతాలలో ప్రజాస్వామ్యం ఆచరణలో వుండేది! ఇందుకు వైశాలీ నగరం ఒక చక్కటి ఉదాహరణ!

లిచ్ఛవీల రాజధానీ నగరం వైశాలి. ఈ నగర పౌరులు ఓటు వేయడం ద్వారానే తమ పాలకులను ఎన్నుకునేవారు. అయితే అలా ఎన్నుకునే అర్హత అందరికీ వుండేది కాదు. సమాజం

బాధ్యతాయుతమైన పౌరులుగా గుర్తించినవారికి మాత్రమే ఎన్నుకునే హక్కు పరిమితమై వుండేది!

క్రీ॥పూ॥ 6 వ శతాబ్దం నుంచి, క్రీ॥శ॥ 4 వ శతాబ్దం వరకు దాదాపు వెయ్యేళ్ళ పాటు లిచ్ఛవీలు ఇలాంటి ప్రజాస్వామ్య పద్ధతిని అవలంబించారని తెలుస్తున్నది.

వైశాలీ నగరం సువిశాల సుసంపన్న నగరం. గంగానదికి ఉత్తరతీరంలో, బీహారురాష్ట్రం ముజఫర్‌పూర్ జిల్లా బసర్ గ్రామ సమీపంలో వైశాలీ నగర శిథిలాలను కనుగొన్నారు. నాటి వైశాలీ నగర రాజ్యం ఈనాటి ముజఫర్‌పూర్ జిల్లా కన్నా కొంత పెద్దదిగా వుండేదని చెబుతున్నారు. అహింసామూర్తి గౌతమ బుద్ధుడు ఈ నగరాన్ని పర్యటించి తన జీవకారుణ్యసిద్ధాంతాలను ప్రబోధించాడు.

గుప్తులయుగం ప్రారంభం కావడంతో, వైశాలీ నగర ప్రాముఖ్యతా, లిచ్ఛవీల ప్రాబల్యమూ తగ్గుముఖం పట్టాయి.

# చందమామ కబుర్లు



## భూకంపాన్ని తట్టుకున్న బక్‌హెల్మ్!

ఇటీవల కాలిఫోర్నియాలో వాటిల్లిన భూకంపంలో బక్‌హెల్మ్ అనే ఆయన కారు కింద పడి చిక్కుకుపోయాడు. ఆ కారు మీద భవనం కూలిపడింది. తొంభై గంటలు గడిచాక, శిథిలాలను తొలగించినప్పుడు, బక్‌హెల్మ్ స్పృహ కోల్పోయిన స్థితిలో కనిపించాడు. వెంటనే అతన్ని బయటకు లాగి ప్రాణాలు కాపాడారు. ఇలా ఇంతసేపు ప్రాణాలతో ఉండడం చాలా అరుదైన విషయమే అయినప్పటికీ, ఈ సంఘటన—బాధలను భరించగల అపూర్వ మానవశక్తిని కూడా సూచిస్తుంది।



## నశించిపోతూన్న అతిపెద్ద జంతువు?

బ్లూవేల్ అనే తిమింగిలమే ఈనాడు ప్రపంచంలోకెల్లా చాలా పెద్ద జంతువు. ఇటీవలికాలం వరకు ఈ జలచరాలు పదివేల వరకు వుండేవనీ, కాని ఇప్పుడు వీటి సంఖ్య రెండువందలకు తగ్గిపోయిందనీ ఇంటర్నేషనల్ వేలింగ్ కమిషన్ తెలియజేస్తున్నది. చట్టవిరుద్ధమైనప్పటికీ తిమింగిలాల వేట కొనసాగుతూనే ఉన్నది. వీటి వినాశానికి జలకాలుష్యం కూడా ముఖ్య కారణం. మానవుడు తన స్వభావాన్నీ, దృక్పథాన్నీ మార్చుకుంటేతప్ప తిమింగిలాలు నశించిపోయే అపాయం తప్పదు.

# సాహిత్యావలోకనం

1. బడిచదువులు సైతం పూర్తి చేయకపోయినప్పటికీ గొప్ప రచయితలుగా ప్రసిద్ధిగాంచిన ముగ్గురు ఎవరు ?

2. ప్రపంచంలోకెల్లా చాలా చిన్న పుస్తకం ఏది ?

3. తన పేరును ఏడు రకాలుగా రాసిన రచయిత ఎవరో మీకు తెలుసా ?

4. నోబెల్ బహుమతీ ప్రదానం జరిగే నగరాలు ఏవి ?

5. ఇటీవలి కాలంలో, వేగంగా రాసే రచయితగా పేరు పొందిన వారెవరు ?

## సమాధానాలు

ఎవరాయన ?

డయోజినీస్.

లోకజ్ఞానం

1. జపానుకు చెందిన మినర్వా జాంకో టబీ
2. అవును. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో అండమాన్ దీవులను.
3. 'న్యూయార్క్' నుంచి 'నై' 'లండన్' నుంచి 'లన్' కలిసి 'నైలాన్' అయింది.
4. క్లైడ్ టోంబాగ్. 1930 లో
5. ప్లాటో
6. 'యాక్'.

సాహిత్యం

1. చార్లెస్ డికెన్స్, మార్క్‌ట్వైన్, మాక్సిం గోర్కీ
2. ఎల్బర్ట్ హబ్బర్డ్ రాసిన "ఎస్సే ఆన్ సైలెన్స్" పుస్తకంలో పేరు తప్ప మరో అక్షరం లేదు.
3. విలియం షేక్స్‌పియర్.
4. స్టాక్‌హోమ్, ఓస్లో.
5. ఎర్లస్టాన్లీ గార్డనర్. (1889–1970) ఒకప్పుడాయన ఒకే సమయంలో ఏడు నవలలు రాశాడు.

# నెహ్రూ కథ—12

జైలునుంచి విడుదలయ్యాక, 1934 వ సం॥ జనవరిలో ఒకనాటి మధ్యాన్నం, తమ ఇంటి ఆవరణలో రైతులనుద్దేశించి నెహ్రూ ఉపన్యసిస్తున్నప్పుడు, ఇంటి పైకప్పు పెంకులు జారి కిందికి పడసాగాయి. అప్పుడే మెల్లగా భూకంపం ప్రారంభమయింది.

అయినా, నెహ్రూ, కార్యక్రమం ప్రకారం తన సతీమణితో కలిసి కలకత్తాకు పయనమయ్యాడు. తీవ్రవాదులను అణచే నెపంతో, ప్రభుత్వం తీసుకుంటూన్న అణచివేత చర్యలను తీవ్రంగా విమర్శిస్తూ నెహ్రూ అక్కడ అనేక సభలలో ఉపన్యసించాడు.





నెహ్రూ నాలుగు రోజుల తరవాత పాట్నా చేరి, భూకంపం కలిగించిన ఘోర వినాశాన్ని కళ్ళారా చూశారు. అసంఖ్యాకమైన ఇళ్ళు నేలమట్టమయ్యాయి. ఎంతో మంది ప్రాణాలు కోల్పోయారు. తమకు ఆతిథ్యమివ్వడానికి ఉన్న వారి ఇల్లు కూడా శిథిలమయింది. రాత్రి తెల్లవార్లూ ఆరు బయటనే గడిపారు!



ఆ తరవాత నెహ్రూ దంపతులు అలహాబాదు చేరుకున్నారు. ఒకనాడు నెహ్రూ, పురుషోత్తందాస్ టాండన్ మాట్లాడుతున్నప్పుడు పోలీసులు వచ్చారు. కలకత్తాలో ఇచ్చిన ఉపన్యాసం నేరమని నెహ్రూను ఖైదుచేశారు. "మీ రాకకోసమే చాలాసేపు ఎదురుచూస్తున్నాను," అన్నాడు నెహ్రూ అక్కడికి వచ్చిన అధికారితో.

నెహ్రూను కలకత్తాకు తీసుకువెళ్ళి అలిపూర్ జైలులో ఉంచారు. అయిదారడుగులే విస్తీర్ణంగల జైలు గదిలో అటూ ఇటూ తిరుగుతూన్నప్పుడు నెహ్రూకు, బోనులోని మృగాలు జ్ఞాపకం వచ్చాయి.






కార్యకర్తల ప్రవర్తన అసంతృప్తి కలిగించడంతో, గాంధీజీ 1934 వ సం॥ సహాయ నిరాకరణోద్యమాన్ని ఉపసంహరించుకోవాలని పిలుపునిచ్చాడు. వార్తాపత్రికలలో ఈ విషయం చదివి నెహ్రూ ఎంతగానో నిరాశ చెందాడు.

కమలా నెహ్రూకు తీవ్రంగా జబ్బు చేసింది. ఆమెను చూడడానికి నెహ్రూను రెండుసార్లు తాత్కాలికంగా విడుదల చేశారు. రాజకీయ కార్యకలాపాలనుంచి వైదొలగినట్టయితే శాశ్వతంగా విడుదల చేయగలమని చెప్పారు. అయితే అటువంటి పని ఎప్పుడూ చేయవద్దని కమలానెహ్రూ భర్తను కోరింది.



తరవాత కొన్నాళ్ళకు ఆమెను చికిత్స కోసం - ఐరోపాకు తీసుకువెళ్ళడానికి ప్రభుత్వం నెహ్రూను అనుమతించింది. కమలానెహ్రూ జర్మనీలో మరణించింది. అది నెహ్రూకు పెద్ద దెబ్బ. ఆమె నెహ్రూకు అన్నివేళలా సహధర్మచారిణిగా నడుచుకున్నది. ఆమె సాహచర్యం నెహ్రూకు ఎంతో అండగా వుండేది!

మరికొన్నాళ్ళకు నెహ్రూ తల్లి కూడా కాలధర్మం చెందింది. సంప్రదాయ కుటుంబంలో పుట్టి పెరిగినా ఆమె అభ్యుదయ భావాలు కలిగి వుండేది. బ్రిటిష్ పోలీసులు ఆమెపై చేసిన లాఠీ ప్రయోగం అదురుపాటు నుంచి ఆమె పూర్తిగా కోలుకోనే లేదు!





రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభ మయింది. 1940లో జపాన్ పెర్ల్ హార్బరుమీద బాంబు వేసింది. దాంతో యుద్ధం మలుపు తిరిగింది. జపాన్, అమెరికా దేశాలు యుద్ధంలో పాల్గొనే పరిస్థితి ఏర్పడింది. హఠాత్తుగా ప్రపంచ మంతటా ఉద్రిక్త వాతావరణం వ్యాపించింది.

1942వ సం॥ గాంధీజీ క్విట్ ఇండియా ఉద్యమానికి పిలుపునిచ్చాడు: అంగ్లేయులు భారతదేశాన్ని వదిలిపోవాలి; భారతదేశం బేషరతుగా స్వాతంత్ర్యం పొందాలి. ఆధునిక భారత చరిత్రలో ఇదొక మహోన్నత ఘట్టం.






మరుక్షణమే బ్రిటిష్ ప్రభుత్వం కార్య రంగంలోకి దిగింది. దేశవ్యాప్తంగా వేలాదిమంది స్వాతంత్ర్య యోధులను ఖైదుచేసి జైళ్ళలో తోసింది. నెహ్రూను కూడా ఖైదు చేశారు. ఎక్కడ చూసినా అగ్రహావేశపూరితమైన ఉద్రిక్త వాతావరణం అలుముకున్నది!

—(ముగింపు వచ్చే సంచికలో)



# నీతిపరులు

పూర్వం శ్రీరంగపట్నంలో ముత్యాలశెట్టి అనే రత్న వర్తకు డుండేవాడు. ఆయన గొప్ప ధనికుడు. సముద్ర వ్యాపారం కూడా చేసేవాడు.

ఒకనాడు ముత్యాలశెట్టి వద్దకు రామచంద్రుడు అనే ఆంధ్రదేశపు ధనికుడు వచ్చాడు. ముత్యాలశెట్టి వద్ద ఉండే, మేలి రత్నాలన్నీ చూశాడు. వాటిలో ఒక రత్నం రామచంద్రుడికి బాగా నచ్చింది. దాని వెల ఎంత అని అడిగితే, ముత్యాల శెట్టి నాలుగు వేల వరహాలని చెప్పాడు. రామచంద్రుడి వద్ద మూడువేల వరహాలే ఉన్నాయి. అయినా ఆ రత్నాన్ని వదలటానికి మనసు ఒప్పక ఆయన ముత్యాల శెట్టితో, ''ప్రస్తుతం నా దగ్గర ఉండే మూడువేల వరహాలూ ఇస్తాను. రత్నం నా కివ్వండి. నే నింటికి వెళ్ళి మిగతా, వెయ్యి వరహాలూ పంపుతాను,'' అన్నాడు.

రామచంద్రుడు కులీనుడూ, నిజాయితీ గలవాడూ అన్న సంగతి కనిపెట్టి ముత్యాల శెట్టి, "అలాగే మీ ఇష్టప్రకారమే చెయ్యండి. మీరివ్వవలిసిన మొత్తం మీపేర ఖాతా పుస్తకంలో గుర్తుగా పద్దువేసి ఉంచుతాను,'' అన్నాడు.

రామచంద్రుడు పరమానందంతో రత్నాన్ని తీసుకుని స్వదేశానికి తిరిగి వచ్చాడు. వచ్చిన కొద్దిరోజులకే ఆయనకు జబ్బుచేసి మంచానపడ్డాడు. ఆ వ్యాధి వైద్యానికి లొంగకపోవటంచేత ఆయన ఒక నెల మంచాన తీసుకుని చనిపోయాడు. చనిపోయేటప్పుడు ఆయన తన కొడుకైన పద్మనాభుణ్ణి పిలిచి, తాను శ్రీరంగపట్నంలో ముత్యాలశెట్టి వద్ద కొన్న రత్నం సంగతి చెప్పి, దాని తాలూకు బాకీ తీరస్తానని అతనిచేత ప్రమాణం చేయించుకున్నాడు.



రామచంద్రుడు బతికినన్నాళ్ళూ తన కున్నదంతా ఖర్చుచేసి భోగాలతో జీవితం వెళ్ళబుచ్చినవాడు కావటంచేత ఆయన అనంతరం దమ్మిడీ కూడా మిగలలేదు. అందువల్ల పద్మనాభుడు ఎంత ప్రయత్నించినా తండ్రి చెప్పిన ముత్యాలశెట్టి బాకీ తీర్చలేకపోయాడు. వాడు చివరకు తన తండ్రి కొన్న రత్నాన్ని అమ్మి అయినా బాకీ చెల్లబెడదా మనుకున్నాడు. కాని అంత ఖరీదుగల రత్నాన్ని కొనే తాహతు గల వాళ్ళెవరూ చుట్టుపక్కల పద్మనాభుడికి కనిపించలేదు.

చివరకు పద్మనాభుడు ఆ రత్నాన్ని పట్టుకుని నేరుగా శ్రీరంగపట్టణానికే బయలుదేరాడు. ఆ పట్టణంలో ఆ రత్నం అమ్ముడైతే సరేసరి, లేనిపక్షంలో దాన్ని ముత్యాలశెట్టికి తిరిగి ఇచ్చేసి, అయన ఇచ్చినంత సొమ్ము పుచ్చుకుందామని అతడి ఉద్దేశం. కాని దురదృష్టవశాత్తు పద్మనాభుడు శ్రీరంగపట్టణం చేరే సమయానికి ఆ నగరాన్ని శత్రురాజులు ముట్టడించి కొల్లగొట్టుతున్నారు. నగరమంతా అరాజకంగా ఉన్నది. అటువంటి పరిస్థితిలో పద్మనాభుడు వచ్చినదారి పట్టినట్టయితే క్షేమంగా ఉండేది. కాని వాడు కార్యదీక్ష కొద్దీ నగరమంతా తిరిగి ముత్యాలశెట్టి ఇల్లు కనుక్కోవటానికి ఉపక్రమించాడు. ఈ విధంగా వాడు శత్రుసైనికుల వాతపడ్డాడు. వాళ్ళు పద్మనాభుణ్ణి పట్టుకుని, వాడి వద్ద ఉండే ఖరీదయిన రత్నం కాస్తా కాజేసి, చావ చితకగొట్టి వదిలిపెట్టేశారు.

శ్రీరంగపట్టణం మీద శత్రువులు వచ్చి పడిన సమయంలో ముత్యాలశెట్టి కొడుకు ఇంటినుంచి మైసూరుకు పారిపోయాడు. శత్రుసైనికులు ముత్యాలశెట్టి దగ్గిర ఉన్నదంతా ఊడ్చి పట్టుకుపోయారు. ముత్యాలశెట్టి విచారంతో మంచంపట్టి మనోవ్యాధితోనే ప్రాణాలు వదిలాడు. మైసూరు చేరిన ముత్యాలశెట్టి కొడుకు తన తండ్రి పేరు చెప్పుకుని అక్కడక్కడా

అప్పులు చేసి, చివరకు అప్పుకూడా పుట్టక తెండిక మాడి చనిపోయాడు.

ముత్యాలశెట్టి వంశానికి ఆయన మనమడు గోవిందశెట్టి మిగిలాడు. వాడు చాలా బుద్ధిమంతుడు. వాడికి తాతగారి ఆస్తి సంక్రమించకపోయినా తండ్రి చేసిన అప్పులు సంక్రమించాయి. వాడు కష్టపడి చదువుకుని, పెద్ద వర్తకుల వద్ద గుమాస్తాగా ఉంటూ తన తాహతుకు తగినట్టు చిన్న చిన్న క్రయవిక్రయాలు చేస్తూ, తన సంపాదనలోనే సాధ్యమైనంత మిగుల్చుకుని, తండ్రి చేసిన అప్పులు ఒక్కటొకటే తీరుస్తూరాసాగాడు.



అక్కడ పద్మనాభుడు కూడా అట్టే కాలం బతకలేదు. ముత్యాలశెట్టి బాకీ తీరుస్తానని తండ్రి వద్ద ప్రమాణం చేశాడు. రత్నాన్ని నిష్కారణంగా పోగొట్టుకోవటమే గాక తీవ్రంగా దెబ్బలు తిన్నాడు. ఆ దెబ్బలతోనే మంచంపట్టి మళ్ళీ కోలుకోలేదు. అతను చనిపోయే సమయంలో తన కొడుకైన చంద్రశేఖరుణ్ణి పిలిచి, "నాయనా, శ్రీరంగపట్టణంలో ఉండే ముత్యాలశెట్టికి మీ తాత వెయ్యి వరహాలు బాకీ పడ్డాడు. ఆ బాకీ తీర్చటానికి నేను ప్రయత్నం చేసి నష్టపోయాను. ఆ బాకీ ఇప్పటికి మూడు వేల వరహాలవుతుంది. అందుచేత నీవైనా కష్టపడి ధనం సంపాదించి, శ్రీరంగపట్నం వెళ్ళి, ముత్యాలశెట్టికి బాకీ తీర్చి వారి పద్దుపుస్తకంలో ఈ బాకీ పద్దు రద్దు చేయించు. నీవీ పని చేస్తేగాని నా ఆత్మ నీ తాత ఆత్మ శాంతించవు." అని చెప్పాడు.

చంద్రశేఖరుడు శ్రమపడి డబ్బు కూడబెట్టాడు. త్వరలోనే వాడు నాలుగు వేల వరహాలు పోగుచేసుకుని, వాటితో శ్రీరంగపట్నం వెళ్ళాడు. ముత్యాలశెట్టీ, ఆయన కొడుకూ పోయారనీ, వారి వారసుడు గోవిందశెట్టి ఉన్నాడనీ తెలిసింది. చంద్రశేఖరుడు గోవిందశెట్టి ఇంటికి వెళ్ళి, తన ఊరూ పేరూ చెప్పుకుని, "అయ్యా, మీ తాతగారినాటి పద్దుపుస్తకం తీయిస్తారా?

అందులో ఒక బాకీ తాలూకు పద్దుంటుంది,'' అని అడిగాడు.

ఈ మాట వినగానే గోవిందశెట్టి గుండెల్లో రాయి పడింది. ఆ రోజే వాడు తన తండ్రి చేసిన బాకీలను నిశ్శేషంగా తీర్చివేశాడు. తండ్రిగారి అప్పులు తీరాయి గదా అనుకుంటే తాతగారి అప్పులు మీద పడేలాగుంది.

వాడు చంద్రశేఖరుడితో, ''అయ్యా, నేను మా తండ్రిగారి అప్పులు తీర్చేసరికి తలప్రాణం తోకకు వచ్చింది. మా తాతగారి అప్పులు కూడా తీర్చమనటం ధర్మమా? వాటికి నేను బాధ్యుణ్ణి కాను. వాటికి ఏనాడో కాలదోషం పట్టి ఉంటుంది. క్షమించండి!'' అన్నాడు.

చంద్రశేఖరుడు చిరునవ్వు నవ్వి, ''మీ తాతగారు మా కేమీ బాకీ లేరు. ఏనాడో మా తాతగారే మీ తాతగారికి వెయ్యి వరహాలు బాకీపడ్డారు. మాట నమ్మకంమీద మీ తాతగారు అప్పు పెట్టారు. పరువైన వాడి మాటకు కాలదోషం ఏముంటుంది గనక? మా తాతగారి బాకీ వడ్డీతో సహా తీర్చటానికి సొమ్ము తెచ్చాను. దయచేసి పద్దుపుస్తకం వెతకండి,'' అన్నాడు.

గోవిందశెట్టి చంద్రశేఖరుడి నీతిపరత్వానికి ఆశ్చర్యపడ్డాడు. అతను పాత కట్టలన్నీ వెతకగా ఒక పద్దుపుస్తకంలో రామచంద్రుడి పేర వెయ్యి వరహాలు ఖర్చు పద్దు వున్నది.

గోవిందశెట్టి చంద్రశేఖరుడితో, ''ఈ బాకీ సంగతి మీరు చెప్పేదాకా నాకు తెలీదు. నేను దీన్ని రొక్కంగా పుచ్చుకోను. మీవంటి నీతిపరులు ఎక్కడా నాకు దొరకరు. మీరు తెచ్చిన నాలుగు వేల వరహాలతో మనిద్దరమూ సమిష్టి వ్యాపారం చేద్దాం. మీకు అభ్యంతరం లేకపోతే చెప్పండి,'' అన్నాడు.

చంద్రశేఖరుడు సరేనన్నాడు. ఇద్దరూ కలిసి వ్యాపారం చేసి త్వరలోనే సంపన్నులై, ఎంతో స్నేహంగా ఉంటూ జీవితాలు వెళ్ళబుచ్చారు.






# కృష్ణావతారం

ఒకనాడు తెల్లవారుఝామున కృష్ణుడు సాత్యకినీ, ఉద్ధవుణ్ణీ వెంటబెట్టుకుని సభకు బయలుదేర బోతూండగా, ఎవరో ఒక మనిషి అతని దర్శనార్థమై వచ్చాడు. ద్వారపాలకుల వెంట వచ్చిన ఆ మనిషి, ''దేవా, మగధదేశాన్ని పాలించే జరాసంధుడు ఇరవైవేలమంది రాజులను జయించి, చెరలో పెట్టి, నానా హింసలూ పెడుతున్నాడు. వారందరూ నిన్ను శరణు వేడుతూ, నన్ను తమ ప్రతినిధిగా పంపారు. మేమందరమూ నీ ప్రజలమే గనక, మమ్మల్ని రక్షించేభారం నీదే,'' అన్నాడు.

అదే సమయంలో అకస్మికంగా నారదుడు వచ్చాడు. కృష్ణుడు నారదుడికి ఆదరంతో అతిథి మర్యాదలన్నీచేసి, విశేషాలేమిటని అడిగాడు. అప్పుడు నారదుడు, ''పాండవాగ్రజుడైన ధర్మరాజు రాజ్యం సంపాదించ గోరి ఇంద్రప్రస్థంలో రాజసూయం తలపెట్టాడు. ఆ రాజసూయ యాగానికి నీవే అధ్వర్యం వహించాలని ధర్మరాజు కోరుతున్నాడు. నీ రాకకోసం రాజులందరూ ఎదురు చూస్తున్నారు,'' అన్నాడు.

ఒక వంక జరాసంధుడి చేత చెరపెట్టబడిన రాజులు కృష్ణుడి సహాయం అర్థిస్తూ దూతను పంపారు. అదే సమయంలో ధర్మరాజు చేసే రాజసూయానికి అధ్వర్యుడుగా ఉండమని నారదుడి ద్వారా పిలుపు వచ్చింది.



''మనం ఈ రెంటిలో ఏది ప్రథమ కర్తవ్యంగా భావించాలి?'' అని కృష్ణుడు ఉద్ధవుణ్ణి సలహా అడిగాడు.

''జరాసంధుణ్ణి చంపటానికి వేరే పని పెట్టుకుని వెళ్ళవలసిన పని ఉండదు. ఎందుచేతనంటే, ధర్మరాజు రాజసూయం చేసేటప్పుడు ఎలాగూ అనేకమంది రాజులను జయించవలసి ఉంటుంది. పనిలో పనిగా జరాసంధుడి సంగతి కూడా చూడవచ్చు. రాజసూయానికి వెళ్ళటమే మంచిది. ఆవిధంగా రెండు కార్యాలూ నెరవేరుతవి,'' అన్నాడు ఉద్ధవుడు.

ఉద్ధవుడు మరొక సంగతి కూడా గుర్తు చేశాడు: జరాసంధుడి పైకి సేనలతో వెళ్ళి గెలవటం సాధ్యం కాదు. బలంలో ఆ జరాసంధుడికి తుల్యుడైన ఏ భీముడో ద్వంద్వ యుద్ధంలో జయించవలసిందే. మరో మార్గం లేదు.

ఉద్ధవుడి సలహా కృష్ణుడికి నచ్చింది. అతను బలరాముడి అనుమతి పొంది, స్త్రీలతో సహా వెంటనే ఇంద్రప్రస్థానికి ప్రయాణ సన్నాహాలు సాగించమని దారుకుడు మొదలైన వారికి ఉత్తరువిచ్చాడు. కృష్ణుడు చతురంగ బలాలనూ, పల్లకీలలో రుక్మిణీ, సత్యభామా మొదలైన స్త్రీ జనాన్నీ వెంట పెట్టుకుని అట్టహాసంగా తరలి వెళ్ళాడు. బయలుదేరే ముందు నారదుణ్ణి పంపేసి, తన వద్దకు వచ్చిన దూతతో, ''మీ రాజులను భయపడవద్దని చెప్పు. నేను తప్పక జరాసంధుణ్ణి చంపించి మీ రాజులకు త్వరలో స్వేచ్ఛ ఇస్తాను,'' అని అతన్ని కూడా సాగనంపాడు.

కృష్ణుడు వస్తున్న వార్త విని ధర్మరాజు అమితానందంతో ఎదురు వెళ్ళి, ఆనంద బాష్పాలు కారుస్తూ కృష్ణుణ్ణి ఆలింగనం చేసుకున్నాడు.

కృష్ణుడు పాండవులను తగిన విధంగా పరామర్శించి, జెండాలతోనూ, తోరణాలతోనూ, అరటిచెట్లతోనూ అలంకరించిన వీధుల వెంబడి ఇంద్రప్రస్థం ప్రవేశిం

చాడు. కృష్ణుణ్ణి చూడటానికి పౌరులు వీధుల వెంబడీ, మిద్దెల మీదా గుమి కూడారు.

ధర్మరాజు ఇంట కృష్ణుడు కుంతినీ, ఆమె కోడళ్ళనూ చూశాడు.

పాండవులకు కృష్ణుడు ఎంతో ఆప్తుడు. కృష్ణార్జునుల స్నేహం లోకోత్తరమైనది. అర్జునుడు ఖాండవదహనం చేయించి నప్పుడు కృష్ణుడు స్వయంగా అతనికి సారథ్యం చేశాడు; అతనికి దివ్యమైన రథమూ, గుర్రాలూ, అక్షయతూణీరాలూ ఇప్పించాడు; మయుడి చేత మయసభ నిర్మింపజేసి పెట్టాడు. అందుచేత ధర్మ రాజు చాలాకాలంపాటు కృష్ణుణ్ణి సపరి వారంగా తన వద్ద ఉంచుకుని, చివరకు ఒకనాడు, తాను తలపెట్టిన రాజసూయం గురించి నిండుసభలో కృష్ణుడితో ప్రస్తా వించాడు.

కృష్ణుడు ధర్మరాజును అభినందిస్తూ, "నువ్వు రాజసూయం చెయ్యటానికి ఆక్షేపణ ఏమున్నది? దిగ్విజయం చెయ్య టానికి దిక్పాలకుల వంటి నీ తమ్ము లున్నారు. వాళ్ళు నీకు నాలుగు దిక్కులూ గెలిచిపెట్టగలరు," అన్నాడు.

ఆ మాట విని ధర్మరాజు చాలా సంతో షించి, నలుగురు తమ్ములనూ నాలుగు దిక్కులూ జయించి రావటానికి పంపాడు.



సహదేవుడు దక్షిణానికీ, నకులుడు పడమరకూ, అర్జునుడు ఉత్తరానికీ, భీముడు తూర్పుకూ వెళ్ళి ఆయా దిక్కుల గల రాజులను గెలిచి, రాజసూయం కొనసాగించటానికి అంతులేని ధనాలను తెచ్చి ధర్మరాజు కిచ్చారు.

రాజులందరూ ఓడారు గాని, జరా సంధుడు ఓడలేదు. ఇది ధర్మరాజుకు విచారకారణమయింది. అది చూసి కృష్ణుడు, "జరాసంధుడి విషయం దిగులుపెట్టుకోవద్దు. అతన్ని జయించే ఉపాయం నేనిక్కడికి బయలుదేరే ముందే ఉద్ధవుడు చెప్పాడు. ఆ పని నేను నెరవేరుస్తాను," అన్నాడు.



అతను భీముణ్ణీ, అర్జునుణ్ణీ వెంట బెట్టుకుని, జరాసంధుడి రాజధాని అయిన గిరివ్రజపురం వెళ్ళాడు. అక్కడ ముగ్గురూ బ్రాహ్మణవేషాలు ధరించారు. జరాసంధుడు రోజూ బ్రాహ్మణ పూజ చేస్తాడు. అతను ఆ పనిలో నిమగ్నుడయి ఉండే సమయంలో వీళ్ళు అతని వద్దకు వెళ్ళి, "మేం దూరదేశం నుంచి వచ్చిన అతిథులం, మేము కోరినది ఇయ్యి," అన్నారు.

జరాసంధుడు వాళ్ళను శ్రద్ధగా చూశాడు. ఆ ముగ్గురి ఆకారాలూ, కంఠస్వరాలూ పరిచితమైనవిగానే వున్నాయి. వాళ్ళ ముంజేతులు కాయలుగాచి ధనుర్బాణాలు ఉపయోగించే రాజుల కున్నట్టుగా ఉన్నాయి. వాళ్ళు నిస్సందేహంగా బ్రాహ్మణవేషాలు ధరించిన క్షత్రియులే!

అయినా జరాసంధుడు వాళ్ళ కోరిక తీర్చటానికే నిశ్చయించుకుని, "మీకేం కావాలి?" అని అడిగాడు.

"మాకు కావలసింది నీతో ద్వంద్వయుద్ధం. ఇతను భీముడు. ఇతను అతని తమ్ముడు అర్జునుడు. నేను నీ పగవాణ్ణి, కృష్ణుణ్ణి," అన్నాడు కృష్ణుడు.

ఈ మాటలు విని జరాసంధుడు నిర్లక్ష్యంగా నవ్వి, "అలా అయితే ద్వంద్వయుద్ధం చేస్తాను. కాని నీతో చెయ్యను— నన్ను చూసి బెదిరిపోయి మధుర నుంచి పారిపోయి, సముద్రంలో దాక్కున్న పిరికిపందవు! ఈ అర్జునుడితోనూ యుద్ధం చెయ్యను. ఎందుకంటే ఇతను నా కన్న చిన్నవాడు. అదీగాక బలంలో అతను నాకు చాలడు. నాతో భీముడు సమానుడు. అతనితో ద్వంద్వయుద్ధం చేస్తాను," అన్నాడు.

జరాసంధుడు ఒక ఉద్దండమైన గదను భీముడి కిచ్చి, అలాటిదే తాను కూడా తీసుకున్నాడు. కృష్ణార్జునులతో సహా వారిద్దరూ నగరం దాటి యుద్ధభూమికి వెళ్ళారు. అక్కడ భీమజరాసంధులు

గదా యుద్ధం ప్రారంభించారు. ఒకరి దెబ్బలు ఒకరు తప్పుకుంటూ, అవకాశం దొరికినప్పుడు ఒకరి నొకరు గదలతో మోదుకుంటూ ఆ ఇద్దరూ రెండు మదించిన ఏనుగుల్లాగా పోరాడారు. చివరకు ఇద్దరి గదలూ విరిగిపోయాయి. అప్పుడు వారు ముష్టియుద్ధం సాగించారు.

జరాసంధుడు పుట్టినప్పుడు రెండు చీలికలై పుట్టాడు. జర అనే పిశాచి ఆ రెండు చీలికలనూ కలిపింది. అందుచేత అతనికి జరాసంధుడనే పేరు వచ్చింది. ఈ సంగతి కృష్ణుడు ఎరుగును. అతన్ని చంపటానికి కూడా రెండుగా చీల్చడమే మార్గమని భీముడికి తెలియ జెప్పటానికై, కృష్ణుడు ఒక పుల్ల తీసుకుని రెండుగా చీల్చాడు. ఈ సంకేతం భీముడికి అర్థమయింది. భీముడు జరాసంధుణ్ణి కింద పడదోసి, ఒక కాలిని తన కాలితో తొక్కిపెట్టి, రెండో కాలు పట్టుకుని జరాసంధుణ్ణి నిలువుగా చీల్చాడు.

యుద్ధాన్ని చూడవచ్చిన జనులు రెండు చీలికలైపోయిన జరాసంధుణ్ణి చూసి హాహాకారాలు చేశారు.

కృష్ణార్జునులు భీముణ్ణి కౌగలించుకుని, అభినందించారు.

జరాసంధుడు చచ్చిన మీదట కృష్ణుడు జరాసంధుడి కొడుకైన సహదేవుణ్ణి మగధ



రాజ్యానికి రాజుగా అభిషేకించి, జరాసంధుడు చెరపెట్టిన రాజులందరినీ విడిపించాడు.

కృష్ణుడు చెప్పిన మీదట సహదేవుడు ఆ రాజులందరికీ స్నానపానాలు ఏర్పాటు చేసి, మంచి విలువయిన కానుకలిచ్చి ఘనంగా సత్కరించి, వాళ్ళ వాళ్ళ దేశాలకు పంపేశాడు.

కృష్ణుడు భీమార్జునులను వెంట బెట్టుకుని ఇంద్రప్రస్థానికి తిరిగి వచ్చి, జరాసంధుడి మరణవార్త ధర్మరాజుకు చెప్పాడు. తన కోరిక సిద్ధించినందుకు ధర్మరాజు సంతోషించి, కృష్ణుణ్ణి రకరకాల స్తోత్రం చేశాడు.



తరవాత ధర్మరాజు రాజసూయయాగం ఆరంభించాడు. దానికి ఋత్విక్కులు కృష్ణద్వైపాయనుడూ, భరద్వాజుడూ, వసిష్ఠుడూ, విశ్వామిత్రుడూ, గౌతముడూ మొదలుగాగలవారు అనేకమంది.

యాగానికి ధర్మరాజు భీష్మణ్ణీ, ధృతరాష్ట్రుణ్ణీ, ఆయన కొడుకులనూ, ద్రోణుడూ, కృపుడూ, విదురుడూ మొదలైన వారినీ పిలిపించాడు.

అనేకమంది రాజులూ, నాలుగు కులాలవారూ కూడా వచ్చారు.

బంగారు నాగళ్ళతో యజ్ఞభూమిదున్ని, వేదిక మొదలైనవి ఏర్పాటు చేసి, ఋత్విక్కులు ధర్మరాజు చేత యజ్ఞదీక్ష ధరింపజేశారు. రాజసూయం చాలా వైభవంగా జరిగింది. యజ్ఞకర్త సదస్యులనూ, యాజకులనూ సత్కరించవలసిన రోజు వచ్చింది. ఆ రోజు ధర్మరాజు సదస్యులను, "తమ అందరిలోనూ ప్రథమ పూజార్హు డెవరో నిర్ణయించండి," అని అడిగాడు.

కాని ఆ ప్రశ్నకు ఎవరూ సమాధానం చెప్పలేకపోయారు. ఎందుచేతనంటే సభలో ఎందరో మహాత్ములున్నారు. అందరూ నోళ్ళు కట్టుపడి ఉన్న సమయంలో సహదేవుడు, సభను ఉద్దేశించి, "దీని కింత ఆలోచన దేనికి? భగవంతుడైన కృష్ణుడే ప్రథమ పూజార్హుడు. అతన్ని పూజిస్తే సర్వభూతాలనూ పూజించినట్టే," అన్నాడు.

సహదేవు డన్న ఈ మాటకు సభాసదులందరూ ఆమోదం తెలిపారు. ధర్మరాజు వెంటనే కృష్ణుడి కాళ్ళు కడిగి, అతనికి పచ్చని పట్టుబట్టలూ, ఆభరణాలూ పెట్టాడు. మిగిలిన రాజులందరూ కృష్ణుడికి నమస్కారాలు చేశారు.

కాని ఇదంతా దమఘోషుడి కొడుకైన శిశుపాలుడికి కొంచెం కూడా నచ్చలేదు. అతను చివాలున లేచి నిలబడి, చెయ్యెత్తి, "కాల ప్రభావం కాకపోతే ఆ కుర్రకుంక చెప్పటమేమిటి, మీరంతా అవుననట

మేమిటి? ఇంతమంది మేటి తపస్వు లున్న ఈ సభలో, కులపాంసనుడైన ఈ గోపకుడికి ప్రథమ పూజ చేయవచ్చునా? యయాతి శాపం పొందిన యాదవులు పూజార్హులెలా కాగలరు?'' అంటూ పేలాడు.

కృష్ణుడు చలించలేదు, కాని మిగిలిన వారిలో కొందరు చెవులు మూసుకుని సభనుంచి లేచిపోయారు. మరి కొందరు శిశుపాలుడితో యుద్ధానికి తలపడ్డారు. కృష్ణుడు వారి నందరినీ వారించి, తన సుదర్శన చక్రం ప్రయోగించి, శిశుపాలుడి తల నరికేశాడు. గగ్గోలు పుట్టింది. శిశుపాలుడి పక్షం వారంతా పారిపోయారు.

ధర్మరాజు అందరికీ సక్రమంగా దానాలు చేసి, అవభృతస్నానం చేసి యజ్ఞం పరిసమాప్తి చేశాడు.

రాజసూయం చూడటానికి వచ్చిన రాజు లందరూ వెళ్ళిపోయాక కూడా, ధర్మరాజు కోరికపై కృష్ణుడు ఉండి పోయాడు.

ఈలోపల దుర్యోధనుడు అసూయతో కుమిలి పోసాగాడు. ఎందుకంటే, ధర్మరాజు విభవాన్ని తాను కళ్ళారా చూశాడు. రాజసూయం మహా గొప్పగా జరిగింది. మయుడు ధర్మరాజుకు అద్భుతమైన సభ నిర్మించాడు. ఆ సభలో పాండవులకు ఎక్కడెక్కడి రాజులూ కైంకర్యం చేశారు. అందులో కృష్ణుడి భార్యలు విహారాలు చేశారు. ఆ సభలోనే దుర్యోధనుడు పరాభవం కూడా పొందాడు. అందులో ఎక్కడ నీరున్నదీ, ఎక్కడ నేల ఉన్నదీ సరిగా తెలియరాలేదు. దుర్యోధనుడు నీరులేని చోట బట్టలు పైకి తీసుకున్నాడు. నీరున్న చోట బట్టలు తడిసేలాగ దిగబడ్డాడు. దానిని చూసి కృష్ణుడు నవ్వాడు. అది చూసి అందరూ, స్త్రీలతో సహా పకపకా నవ్వారు. ధర్మరాజు నవ్వవద్దని వారించాడుగాని, ఎవరూ లక్ష్యపెట్టలేదు. పుట్టెడు అవమానం పొంది దుర్యోధనుడు హస్తినాపురానికి తిరిగి వెళ్ళాడు.






# శక్తి-యుక్తి

అవంతీ రాజ్యంలోని, అమరపురం అనే గ్రామంలో శంభుమిత్రుడనే వాడుండే వాడు. అతడికి తాను తండ్రికి తగ్గ కొడుకనిపించుకోవాలని వుండేది. శంభు మిత్రుడి తండ్రి అమరనాథుడు, తాను సామాన్య పౌరుడైనప్పటికీ, ప్రజల మన్ననలందుకున్నాడు. ఆయన కాలంలో అవంతీరాజ్యానికి చక్రనేమి అనే క్రూరుడు రాజుగా వుండేవాడు. అతడు ప్రజాధనాన్ని తన విలాసాలకు ఖర్చుపెడుతూ, ప్రజల యిబ్బందులనేమీ పట్టించుకునేవాడుకాదు.

అలాంటి పరిస్థితులలో, అమరనాథుడు తన గ్రామ ప్రజలకు ఎంతో సేవ చేశాడు. తన బండిమీద రోగులను రాజధానికి తీసుకుపోయి వైద్యం చేయించాడు. తన శక్తికొద్దీ పిల్లలకు ఉచితంగా విద్య నేర్పేవాడు. గ్రామస్థులను కూడగట్టుకుని, గ్రామంలోని రహదారులు బాగుచేసేవాడు. ఈ విధంగా, అతడు అమరపురంలో చెరగని కీర్తిని సంపాయించుకున్నాడు.

అమరనాథుడి మరణానంతరం, శంభు మిత్రుడు కూడా ప్రజాసేవచేసి కీర్తి తెచ్చుకోవాలని అభిలషించాడు. అయితే, అతడి కాలం వచ్చేసరికి, రాజు చక్రనేమి కుమారుడు వినయవర్మ రాజయ్యాడు. అతడు తన తండ్రిలా కాక, ప్రజాక్షేమాన్ని దృష్టిలో పెట్టుకుని, అనేక ప్రయోజకర మైన పనులు చేశాడు. అందువల్ల, అమర పురంలో అందరికీ విద్య, వైద్యం వంటి సదుపాయాలు సమకూరాయి. దానితో శంభుమిత్రుడికి, తాను ప్రజాసేవచేసి పేరు పొందే అదృష్టం లేకపోయిందే, అని చింత పట్టుకున్నది.

ఇలా వుండగా, ఒకనాడు బాటసారు లిద్దరు అమరపురానికి వచ్చారు. దాపుల

వక్కలంక 'కిషోర్'



ధర్మసత్రమేదీ లేకపోవడంవల్ల, ఏమి చేయడమా అని వాళ్ళు యోచించసాగారు. ఇంతలో, సంగతి తెలుసుకున్న శంభుమిత్రుడు, వారిని ఆ రాత్రికి తన ఇంట ఆతిథ్యం స్వీకరించవలసిందిగా కోరాడు. బాటసారులు అందుకు సంతోషంగా అంగీకరించారు.

రాత్రి భోజనాలయాక, బాటసారులు శంభుమిత్రుడి పరోపకారబుద్ధిని ఎంతగానో మెచ్చుకుని, అతణ్ణి గురించిన వివరాలడిగారు.

శంభుమిత్రుడు తనను గురించిన వివరాలు చెప్పి, ''నా తండ్రి అమరనాధుడిలాగా, ప్రజాసేవ చేసి కీర్తిగడించాలని వున్నది. కాని, అవకాశమేమీ రావడం లేదు. కొత్తరాజుగారి పరిపాలనలో, అన్ని సౌకర్యాలూ ప్రజలకు అందుబాటులోకి వచ్చాయి. ఇక్కడ ధర్మసత్రం లేకపోబట్టే, నా పరోపకారబుద్ధిని, మీరు గుర్తించే వీలు కలిగింది,'' అంటూ వాపోయాడు.

దానికి ఒక బాటసారి, ''రాజుగారు ప్రజోపయోగకార్యాలు చేయడం, మీకు బాధ కలిగిస్తున్నదన్నమాట!'' అన్నాడు వ్యంగ్యంగా.

''అలాగని కాదు; నాకు ప్రజాసేవ చేసే అవకాశమే లేదే అని, నా చింత,'' అన్నాడు శంభుమిత్రుడు.

అందుకు రెండవ బాటసారి నవ్వి, ''అయ్యా మన రాజుగారు ప్రజాక్షేమానికై పాటుపడుతున్నారు. మీ తండ్రి గొప్పవాడు గనక, మీరు ప్రజలకు మేలు చేసినా, చేయకున్నా వాళ్ళు మిమ్మల్ని గౌరవిస్తారు. మన రాజుగారి సంగతి అలా కాదు. ఆయన తన తండ్రికి గల చెడ్డపేరు పోగొట్టడానికి శాయశక్తులా కృషి చేస్తున్నారు,'' అన్నాడు.

శంభుమిత్రుడు ఏమీ మాట్లాడలేదు. మర్నాటి ఉదయం బాటసారులు వెళ్ళిపోయారు.

ఇది జరిగిన కొన్నాళ్ళకు, శంభుమిత్రుడు పేదలకు అన్నదానం చేయ

దలచిన రోజున, రాజధానిలో రాజుగారిచే అన్నదానం చేయబడుతుందని, చాటింపు వేయబడింది.

తర్వాత శంభుమిత్రుడు, గ్రామంలో, తన తండ్రిపేర ధర్మసత్రం కట్టించ నున్నట్టు మిత్రులందరికీ చెప్పాడు. అతడి కీర్తికాంక్ష ఎరిగినవాళ్ళు, ఆ పని అతడి శక్తికిమించినదని వారించ జూశారు.

కాని, శంభుమిత్రుడు వాళ్ళమాట కాదని, సత్రం నిర్మించే పని ఆరంభించిన మర్నాడే, రాజుగారి మందీ మార్బలం అమరపురం చేరింది. వాళ్ళు, రాజు వినయవర్మ తన తండ్రిపేర, అమరపురంలో ధర్మసత్రం కట్టబోతున్నట్టు అందరికీ చెప్పారు.

''నా తండ్రిపేరు చిరస్థాయిగా వుండడం కోసం, సత్రం కట్టిద్దామనుకున్నాను. మహారాజు, ఆ అవకాశం పోగొట్టాడు,'' అని శంభుమిత్రుడు, గ్రామ పెద్దలకు తన బాధ చెప్పుకున్నాడు.

అయితే, అతడు కొద్దిరోజుల్లోనే మరొక ఆలోచన చేశాడు. అమరపురంలో, తన తండ్రిపేర ఒక పెద్ద గ్రంథాలయాన్ని స్థాపిస్తున్నట్టు ప్రకటించాడు. కాని, దాని కూడా విఘ్నం కలిగింది. మహారాజు నెలతిరక్కుండానే, అమరపురంలో గ్రంథాలయాన్ని ఏర్పాటు చేశాడు. శంభుమిత్రుడి ఆశయం నెరవేరనందుకు, అతడి సన్నిహితులు శంభుమిత్రుణ్ణి ఓదార్చారు.





విషయం చెబుతాను. ఆరోజు బాటసారులుగా, నీ ఇంటికి వచ్చినది, నేనూ, మహారాజుగారూ. అప్పుడు నీ మాటలను బట్టి, నీకున్నది కేవలం కీర్తి కాంక్ష మాత్రమేనని గ్రహించాం. నీకు తండ్రికి తగ్గ కొడుకుగా పేరు తెచ్చుకోవాలని వుండవచ్చు. అది తప్పు కాదు. కాని, దానికోసమని పరులు కష్టాల్లో వుండాలని కోరుకునే, నీ మనస్తత్వాన్ని మెచ్చుకోలేం. మన కీర్తి ముఖ్యం కాదనీ, ప్రజాక్షేమమే ముఖ్యమనీ, నీకు తెలియజెప్పడం కోసం, అడుగడుగునా నీకు అడ్డుపడుతూ వచ్చాం. ఎలా వున్నది మహారాజుగారి పథకం?'' అని అడిగాడు.

దానికి శంభుమిత్రుడు వినయంగా, ''మహారాజుగారు క్షమించాలి! ఆ బాటసారులు మీరేనని, నేనప్పుడే గ్రహించాను. నా ఇంట అతిథ్యం స్వీకరించినవారెవ్వరూ, నన్ను విమర్శించరు. ఆ రోజు రాజుగారి దాతృత్వాన్ని సమర్థించి, నన్ను విమర్శించినప్పుడే, నిజమేమిటో నేనూహించాను. పైగా నేను చేపట్టదలచిన కార్యక్రమమే, రాజుగారు చేబడుతున్నారంటే — అది యాదృచ్ఛికమని అనుకునేటంత అవివేకిని కాను,'' అన్నాడు.

ధర్మకీర్తి కోపంగా, ''మరైతే మాతో పోటీకి అన్నట్టుగా, ప్రతి పర్యాయమూ

ఆ తర్వాత కూడా ఒకటి, రెండుసార్లు శంభుమిత్రుడు తలపెట్టిన ప్రజోపయోగకరమైన పనులను, మహారాజు ప్రమేయం వల్ల విరమించుకున్నాడు.

ఇది జరిగాక, ఆరునెలలపాటు శంభుమిత్రుడు, గ్రామంలో ఎలాంటి పనులకూ పూనుకోలేదు.

ఒకనాడు అతడికి, రాజధాని నుంచి పిలుపు వచ్చింది. శంభుమిత్రుడు వెంటనే బయలుదేరి రాజుముందు హాజరయ్యాడు. ఆ సమయంలో, మంత్రి ధర్మకీర్తి, రాజుపక్కనే వున్నాడు.

మంత్రి చిన్నగా నవ్వుతూ, ''శంభుమిత్రా! నువ్వు ఆశ్చర్యపడనంటే, ఒక

ఏదో కార్యక్రమాన్ని ఎందుకు చేపట్టావు? రాజుగారితో పోటీపడడం అవివేకం కాదా?'' అని అడిగాడు.

అందుకు శంభుమిత్రుడు, ''మరొక సారి, క్షమించవలసిందిగా కోరుతున్నాను. మన కీర్తి కంటే ప్రజలకు మేలుకలగడమే ముఖ్యమని, నాకు ఆనాడే జ్ఞానోదయ మైంది. అందుకే నేను, ఒక పథకం ప్రకారం కార్యక్రమాలు మొదలుపెట్టాను. నేను చేయలేని పనులెన్నో చేయబో తున్నట్టు బహిరంగంగా ప్రకటించాను. వాటన్నిటినీ మహారాజుగారు, నాతో పోటీకి దిగి పూర్తి చేశారు. ఆయన పూనుకోక పోతే, నిజానికి నేనెలాగూ విరమించుకునే వాణ్ణి. నాలాంటి సామాన్యుడికి గ్రంథా లయాలూ, ధర్మసత్రాలూ నిర్మించడం శక్యంకాని పని. ఇప్పుడు అమరపురంలో తమకేదైనా కావాలంటే, ప్రజలు నాదగ్గిరకు వచ్చి, 'శంభుమిత్రా! నువ్వు సంకల్పించు చాలు. ఆ పని జరిగిపోతుంది,' అంటు న్నారు,'' అన్నాడు.

ఈ సమాధానానికి రాజు వినయవర్మ మండిపడి, ''అయితే మా శ్రమనూ, ధనాన్నీ నీ కీర్తికోసం ఉపయోగించు కుంటున్నావన్నమాట!'' అని అడిగాడు.

''లేదు, మహారాజా! అది వారిలో నేను కలిగించిన నమ్మకం మాత్రమే. వారితో నేను ఈ పనులు రాజుగారితో చెప్పి చేయిస్తున్నానని అని వుంటే, తప్పక నాకు ఎంతో కీర్తి లభించివుండేది. కాని, నేనలా చేయలేదు,'' అన్నాడు శంభుమిత్రుడు.

ఆ మాటలకు వినయవర్మ సంతోషించి, ''శభాష్, శంభుమిత్రా! నేనే నిన్ను తప్పుగా అర్థంచేసుకున్నాను. నువ్వు నిజంగా తండ్రిని మించిన కొడుకువే. నీ తండ్రి తన శక్తికొద్దీ ప్రజలకు సాయ పడితే, నువ్వు నీ యుక్తికొద్దీ సాయ పడ్డావు,'' అన్నాడు.

ఆ తర్వాత ఆయన, శంభుమిత్రుణ్ణి ఘనంగా సన్మానించి, అతడికి ప్రజా సేవకుడుగా పేరు తెచ్చుకునే అవకాశం కూడా కలిగించాడు.





# రాగియంత్రం

వజ్రాలవ్యాపారి వీరభద్రం పట్నంలో పని చూసుకుని, పొద్దుపోయి తమ ఊరు తిరుగుప్రయాణం అయ్యాడు. అతడెక్కిన ఎద్దుబండి పట్నం పొలిమేర దాటుతూండగా, పొడవాటి గడ్డం వున్న మనిషొకడు బండిని ఆపి, "అయ్యా, గంట నుంచి చూస్తున్నాను, ఏ బాడుగబండీ యిటుకేసి రాలేదు. నేను పోలవరం వెళ్ళాలి. బండిలో కాస్తచోటిస్తారా?" అని అడిగాడు.

అందుకు బండివాడు వీలులేదంటూంటే, వీరభద్రం కల్పించుకుని, "మనం పోలవరం మీదుగానేగదా వెళ్ళేది. ఆయన్ని బండి ఎక్కనీ," అన్నాడు.

ఆ మనిషి బండిలో వీరభద్రం పక్కనే కూర్చుని, "చాలా పెద్ద సాయం చేశారు," అని ఒకక్షణం ఆగి, "నా గడ్డం, మాసిన దుస్తులూ చూసి ఏమీ అనుకోకండి. నా పేరు రామేశం. నేనెన్నో యిక్కట్లకోర్చి హిమాలయాలకు వెళ్ళి, అక్కడి నుంచి తిరగొస్తున్నాను," అన్నాడు.

"హిమాలయాల నుంచా?" అన్నాడు వీరభద్రం, అతడి మాటలు నమ్మలేక.

అది గ్రహించిన రామేశం, తన చొక్కా పైజేబులో నుంచి ఒక రాగియంత్రం తీసి, "చూడండి! ఇదేమిటి?" అని అడిగాడు.

వీరభద్రం దాన్ని అటూ యిటూ తిప్పి పరీక్షగా చూసి, "రాగియంత్రం. పైన ఏవో బీజాక్షరాలు చెక్కి వున్నవి," అన్నాడు.

రామేశం ఆ రాగియంత్రాన్ని జేబులో పెట్టుకుని, "ఇది ఏవో బీజాక్షరాలున్న మామూలు రాగిరేకు కాదు. హిమాలయాల్లో తపస్సు చేసుకుంటున్న ఒక యోగి, నా కష్టాలు ఆలకించి ప్రసాదించాడు. దీన్ని దేవుని మందిరంలో వుంచితే, నా కష్టాలన్నీ తీరిపోతాయని చెప్పాడు. ఏడాది క్రితం

మాచిరాజు కామేశ్వరరావు

ఇల్లు వదిలిపోయిన నేను, మంత్రశక్తిగల యీ రాగియంత్రం లభించిందన్న ధైర్యంతో తిరిగివస్తున్నాను,'' అన్నాడు.

ఆ తర్వాత కొద్దిసేపట్లోనే, ఇద్దరికీ నిద్ర ముంచుకువచ్చింది.

''అయ్యా, పోలవరం వచ్చాం!'' అంటూ బండివాడు వేసిన కేకతో వీరభద్రం మేలుకుని, రామేశంతో, ''ఇక లేవండి. మీ ఊరు చేరాం,'' అన్నాడు.

రామేశం కదలలేదు. వీరభద్రం అతణ్ణి నిద్రలేపేందుకు, ఒంటి మీద చెయ్యి వేసి ఉలిక్కిపడ్డాడు. అతడి ఒళ్ళు మంచులా చల్లగా వున్నది. తర్వాత అతడి ఇల్లెక్కడో వెతికి తెలుసుకుని, జరిగింది అతడి భార్యకు చెప్పాడు, వీరభద్రం. ఏడాది క్రితం ఇల్లొదిలిపోయిన మనిషి, నిర్జీవంగా ఇల్లు చేరడంతో, రామేశం భార్యా, కుమారుడూ, కూతురూ గొల్లుమన్నారు.

వీరభద్రం వాళ్ళను ఊరడించి, ఇల్లు చేరేసరికి తెల్లవారిపోయింది. బండి దిగబోతున్న వీరభద్రానికి, రామేశం తనకు చూపించిన రాగియంత్రం టపడింది. వీలు చూసుకుని దాన్ని రామేశం కుటుంబానికి చేర్చాలని, అతడు దాన్ని తన దేవుడి మందిరంలో పెట్టాడు.

ఆ రాత్రి వీరభద్రానికి సరిగా నిద్ర పట్టలేదు; ఒకటే పీడకలలు. ఆ కలల్లో




అతడి చిన్ననాటి స్నేహితుడు కోదండపాణి, అతడితో, ''ఏరా, భద్రం! ఈ మధ్యేమైనా నీకూ, నీ కొడుక్కూ తగాదా ఏమైనా వచ్చిందా?'' అని అడిగాడు.

''తగాదా? అలాంటిదేం లేదే. ఎందుకలా అడుగుతున్నావు?'' అని ప్రశ్నించాడు వీరభద్రం.

''నీ కొడుకు ఊళ్ళో అందరి దగ్గరకూ వెళ్ళి, ఏదైనా ఉద్యోగం కావాలని ప్రాధేయపడుతున్నాడు. నీ పరువును దృష్టిలో పెట్టుకుని, యీ సంగతి నీ చెవిని వేద్దామనుకున్నాను,'' అన్నాడు కోదండపాణి.

అతడు వెళ్ళిపోగానే, వీరభద్రానికి కొడుకు కనిపించాడు. వీరభద్రం కోపంగా



వాణ్ణి, ''నువ్వు ఊళ్ళో అడ్డమైన వాళ్ళందర్నీ ఏదైనా ఉద్యోగం యివ్వమని అడుగుతున్నావా ?'' అని ప్రశ్నించాడు.

''అవును నాకేదైనా ఉద్యోగం కావాలి,'' అన్నాడు కొడుకు బింకంగా.

''అలాంటి ఖర్మ నీకేం వచ్చింది! మన వ్యాపారం లక్షల్లో నడుస్తున్నది. ఉన్న ఒక్కడివీ అది వదిలి, ఏ దానయ్య దగ్గిరో నౌకరీ చేస్తావా ?'' అన్నాడు వీరభద్రం.

''దానయ్యో, ధర్మయ్యో నాకు ఉద్యోగం కావాలి, అంతే!'' అంటూ కొడుకు విసురుగా వెళ్ళిపోయాడు.

వీరభద్రానికి చప్పున మెలుకువ వచ్చింది. ''ఎన్నడూ లేంది, ఏమిటీ పీడకల!'' అనుకుంటూ లేచి కూర్చుని చాలా బాధపడ్డాడు.

ఆ మరసటిరోజు రాత్రి వీరభద్రానికి మరొకపీడకలవచ్చింది. సంగతేమంటే— ఆయన భార్య బాగా స్థూలకాయురాలు. తింటే ఆయాసం, తినకపోతే నీరసం అనే ధోరణి ఆమెది. వైద్యుడామెను పరీక్షించి, రోజుకు ఒక పూటే భోజనం చెయ్యమనీ, రాత్రివేళ యిన్నిపాలు తాగి వూరుకోమనీ చెప్పి, ఏవో మందు లిచ్చాడు.

అయితే, వీరభద్రానికి వచ్చిన పీడకలలో, ఆమె వంటగదిలో దీపం ముందు కూర్చుని, వెండికంచం నిండుగా అన్నం, కూరలూ వడ్డించుకుని అవురావురుమంటూ తినేస్తున్నది. వీరభద్రం కోపంగా ఆమెను, ''ఏమిటీ దయ్యపు తిండి? వైద్యుడేం చెప్పాడు ?'' అని అడిగాడు.

వీరభద్రం భార్య ఏమాత్రం తొణక్కుండా, ''రోజు కొకపూట తిండి తిని ఎవరైనా బతగ్గలరా ? ఆయన వైద్యుడు కాదు, యమదూత! మీరు వెళ్ళి నిద్రపోండి,'' అనేసింది.

వీరభద్రం ఆ మాటలతో నిద్ర మేలుకుని, ''ఏమిటీ పీడకలలు! నిన్నరాత్రి కొడుకు; ఈరాత్రి భార్య. నాకేమైనా మతి పోతున్నదా. కాస్త తీరుబడి చూసుకుని గురువుగారి ఆశ్రమానికి వెళ్ళిరావడం

మేలు,'' అనుకుంటూ తెల్లవార్లూ మేలు కునే వున్నాడు.

వీరభద్రానికి పీడకలల బాధ అంతటితో తీరలేదు. ఆ మర్నాటిరాత్రి కలలో కూతురు కోమలి ప్రత్యక్షమై, ముఖంలో సిగ్గూ, మాటల్లో మొండితనం కనబరుస్తూ, ''నాన్నా, నేను ఎదురింటి అబ్బాయిని పెళ్లి చేసుకోదలిచాను. వేగిరం ముహూర్తం పెట్టించు,'' అన్నది.

అది విన్న వీరభద్రం నెత్తిన పిడుగు పడ్డట్టయిపోయి, ''ఎదురింటబ్బాయిని చేసుకుంటావా? నీకేమన్నా పిచ్చిపట్ట లేదు గదా. ఆ అబ్బాయి ఏదో కుదరని వ్యాధితో ఎంతోకాలంగా బాధపడుతున్న సంగతి ఊరందరికీ తెలుసు,'' అన్నాడు.

''ఆ సంగతి, నాకూ తెలుసు. నేను పెళ్ళంటూ చేసుకుంటే, ఆ అబ్బాయినే చేసుకుంటాను, విన్నావా?'' అంటూ చప్పట్లు చరిచి వెళ్ళిపోయింది కోమలి.

కల ముగియగానే వీరభద్రం వణుకుతూ లేచి కూర్చున్నాడు. తననేదో పీడకలల పిశాచి ఆవహించిందన్న నమ్మకం కలిగిందతడికి. ఇక జాగుచేసి లాభం లేదు. ఉదయానే బయలుదేరి గురువుగారి ఆశ్రమానికి వెళ్ళి యీ పీడకలల మర్మమేమిటో తెలుసుకోవాలి, అనుకున్నాడు.

సూర్యోదయంతోనే, వీరభద్రం గురువుగారి ఆశ్రమానికి ప్రయాణం కట్టాడు. బయలుదేరబోయేసమయంలో అతడికి,



దేవుడి మందిరంలో దాచిన రామేశం రాగియంత్రం జ్ఞాపకం వచ్చింది. అతడి గ్రామమైన పోలవరం మీదుగానే, వీర భద్రం గురువుగారి ఆశ్రమానికి వెళ్ళాలి. అతడు ఆ రాగియంత్రాన్ని వెంట తీసుకుని బయలుదేరాడు.

వీరభద్రం పోలవరం చేరి, రామేశం ఇంటికి వెళ్ళాడు. రామేశం భార్య అతడికి మర్యాదచేసి, తన భర్త ఇల్లు వదిలి ఎందుకు వెళ్ళాడో చెప్పింది.

''మా అబ్బాయికి పాతికేళ్ళు వచ్చినా, ఎక్కడా ఉద్యోగ ప్రయత్నం చేయకుండా గాలికి తిరుగుతూంటాడు. ఇక మా అమ్మాయికి కట్నం యిచ్చి పెళ్ళిచేసే స్థోమతు, మాకు లేదు. ఎదురింటి అబ్బాయి కట్నం లేకుండా చేసుకుంటానని వస్తే, అతడు అందంగా లేడని అభ్యంతరం చెబుతున్నది. రెండేళ్ళుగా నాకు అన్నం చూస్తేనే ఏవగింపు కలుగుతున్నది. బాగా ఆకలిపుట్టి కంచం నిండు భోజనం చేయక పోతే నేనెంతోకాలం బతకనని, ఆయన భయం. ఈ సమస్యలకు బెదిరి, ఇల్లొదిలి పోయిన ఆయన, ప్రాణాలతో తిరిగి ఇల్లు చేరలేదు!'' అంటూ కళ్ళొత్తుకున్నది.

రామేశం భార్య మాటలు వింటూనే, వీరభద్రం తన పీడకలల మూలకారణం ఏమిటో గ్రహించాడు. రామేశం గృహ సమస్యలు తీరడానికి, యోగి యిచ్చిన బీజాక్షరాలుగల రాగియంత్రం తన మీద ప్రభావం చూపించింది!

వీరభద్రం, రామేశం భార్యతో, ''అమ్మా, మీరు బాధపడకండి. మీ ఆయన హిమాలయాల్లో తపస్సు చేసుకునే ఒక యోగిప్రసాదించిన రాగియంత్రం ఒకటి తెచ్చాడు,'' అని బండిప్రయాణంలో దానిని రామేశం పోగొట్టుకున్న సంగతి చెప్పి, ''అమ్మా, ఎంతో ప్రభావం గల, ఆ యంత్రం యిదుగో! దీన్ని మీ దేవుడి మందిరంలో వుంచండి. మీ సమస్యలన్నీ తీరిపోతాయి,'' అంటూ దాన్ని ఆమెకిచ్చి, ఆనందంగా తన గురువుగారి ఆశ్రమానికి బయలుదేరాడు.





## అతి భయంకరమైన కప్పవిషం!

దక్షిణ అమెరికాలోని కొకోయ్ అనే కప్ప నోటినుంచి అపాయకరమైన విషాన్ని నోటినుంచి బాణంలా చిమ్ముతుంది. ఈ విషం గ్రాములో లక్షవ వంతయినా మనిషి ప్రాణం తీస్తుంది!

ఆస్ట్రేలియా ఉత్తర సరిహద్దులోని 'ఎయెర్స్‌రాక్'ను ప్రపంచంలోకెల్లా చాలా పెద్దబండగా చెప్పుకుంటారు. అయితే ఇది నిజంకాదు. ఈ విశిష్టత పశ్చిమ ఆస్ట్రేలియాలోని 1,237 అడుగుల ఎత్తయిన మౌంట్ అగస్టస్‌కు చెందుతుంది. ఐదుమైళ్ళ పొడవూ, 2 మైళ్ళ వెడల్పూ గల ఈ బండ, సుప్రసిద్ధ 'ఎయెర్‌రాక్' కన్నా పరిణామంలో దాదాపు రెండింతలు పెద్దది!



## బ్రహ్మాండమైన బండ

ఆఫ్రికాలోని మగ ఏనుగు ఎడమ దంతం కుడి దంతంకన్నా చిన్నదిగా వుంటుంది. ఆ ఏనుగు ఎడమదంతాన్ని తవ్వడానికి ఉపయోగించడం వల్ల ఇది బాగా అరిగిపోయి కుడి దంతంకన్నా చిన్నదయిపోతుంది!



బయంలేని నలుగురు-యూసుఫ్ నాయకుడు- గురుస్వామి తెలివైనవాడు-సాహసకృత్యాలకురికే న్యాన్సీ, పరమ్‌ధైర్యవంతుడు ఎప్పుడూఎదోఒక కొత్తదనంకోసం ఎదురు చూస్తారు భారతదేశపు అందచందాలంటే అమితప్రేమ.

కాలినడకన కనుమను చేరుకొనేందుకు సంసిధం అవుతున్నారు...

అబ్బా! నా థైనా క్యులర్స్‌ని సంచీలో ఎందుకు పెట్టేశాను బాబూ! మళ్ళీ యిప్పుడు సంచీ తెరవాలి.

విన్నావా, యీ గొప్ప విషయం హిమాలయాలు యింకా పెరుగుతునే ఉన్నాయట, నీకుతెలుసా? ప్రతి పది సంవత్సరాలకి సుమారు ఒక మీటరు...

యూసఫ్ పరుగెత్తుకుంటు వస్తాడు

గొడవవచ్చింది మిత్రులారా! కనుమకి దగ్గరలో అడవి అంటుకుంది. అక్కడి ప్రజలు ఎవరిని కూడా దానిని దాటి వెళ్ళనివ్వటంలేదు.

'చిప్‌కో' ఉద్యమం ధర్మ మాఅని, కొండ ప్రజలు యిప్పుడు అడవులను బాగా కాపాడు కుంటున్నారు.

ఇంతదూరం వచ్చాకా మనం యీ ప్రయత్నాన్ని వదులుకో డానికి వీలులేదు. మనం కనీసం అక్కడకి వెళ్ళి ఏం జరిగిందో తెలుసుకుందాం.

ఒకప్పుడు యిదంతా ఒక పెద్ద సముద్రం. బహుశా లక్ష సంవత్సరాలక్రితం.

కానిచూడండి, యీ ప్రదేశమంతటా ప్రజలు చెల్లాచెదారం, మరికి ఎలా విడిచిపెట్టి వెళ్ళిపోయారో




వారికి కనుమ కనపడగానే ఆ '4' గురు కాలినడకని కొండలెక్కి తిరిగివస్తున్న బృందాన్ని కలుసుకున్నారు.

వినోద పర్యటన శాఖ , భారత ప్రభుత్వం 

కనుమ దగ్గర...

వాళ్ళు బోలెడు చెత్తా చెదారం వదిలి పెట్టి వెళ్ళిపోయారు. చలి మంటని పూర్తి గా ఆర్పలేదు.

గాలికి నిప్పురవ్వలు ఎగిరి ఖాళీ కాగితం, ప్లాస్టిక్ సంచీల మీదపడ నిప్పంటుకుంది. కొద్దిసేపట్లోన యీ ప్రాంతమంతా మంటలలో నిండిపోయింది.

అదృష్టవశాత్తు మేం పొగ చూసి, అందరం పరుగున అక్కడకి చేరుకున్నాం. కాని ఆ దుర్మార్గులు అప్పటికే పారిపోయారు.

అవును, వాగుదగ్గర వాళ్ళని మేము చూశాం. మనం వెంటనే పరిగెడితే వాళ్ళని పట్టుకోవచ్చు.

మనం అడ్డదారిన వెడదాం. మనం ముందే ఫారెస్ట్ రేంజర్ గస్తీ కేంద్రాన్ని చేరుకోవచ్చు. అక్కడ వాళ్ళని పట్టుకుందాం.









## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1990 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



P. V. Subrahmanyam

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ డిసెంబర్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: వినోదంలో విజ్ఞానం! రెండవ ఫోటో: అనుకరణలో ఆనందం!!

పంపినవారు: చైతన్య, మల్లేశ్వరం, బెంగళూరు—560003

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

